

గృహలక్ష్మి
స్త్రీల ఆరోగ్య సౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన పవిత్ర మాసపత్రిక
సంపాదకుడు:
డాక్టరు. కే. యస్. కేసరి
సంపుటము ౧౯]
15 జూన్ 1947
[సంచిక ౯




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్ధసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి రు. 0-6-0 అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామకే వ్రాయవలయును. చెక్కులు,మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బాంకుల పైననే పంపవలెను.

# విషయసూచిక

## శ్రీ సర్వజిత్ నామ సం॥ ఆషాఢ మాస శేషము.

1947-వ సం॥ జూలై నెల

| | | |
|---|---|---|
| 1 | మం | ష్ఠ త్ర ద 14-7 జ్యే 54-48 శుక్ల 15-1 తై 14-7 ది 6-49 |
| 2 | బు | చతు 17-41 మూ 60-10 శుక్ల 15-32 వ 17-44 ది 18-39 |
| 3 | గు | ○ పూర్ణ 21-55 మూ 2-31 బ్ర 16-29 బ 21-55 ది 29-2 |
| 4 | శు | కృ. పా 26-26 పూ. షా 8-30 ఐ 17-1. కౌ 26-26 ది 30-32 |
| 5 | శ | వి 30-49 ఉ. షా 14-30 వై 18-53 గ 30-48 ది 25-29 |
| 6 | ఆ | తృ 34-55 శ్ర 20-15 విష్కుం 19-53 వ 2-58 ది 31-10 |
| 7 | సో | చ 38-32 ధ 25-35 ప్రీ 20-31 బ 6-39 రా 12-54 |
| 8 | మం | పం 41-20 శ 30-11 ఆయు 20-37 కౌ 9-51 రా 15-10 |
| 9 | బు | ష 43-10 పూ. భా 33-50 సౌ 19 54 గ 12-10 రా 26-51 |
| 10 | గు | స 43-50 ఉ. భా 13-52 శో 18-23 భ 13-25 |
| 11 | శు | అ 43-16 రే 37-47 అతి 15-57 బా 13-28 ది 6-55 |
| 12 | శ | న 41-26 అశ్వ 37-55 సు 12-29 తై 12-16 ది 27-5 |
| 13 | ఆ | ద 38-24 భ 36-51 ధృ 8-3 వ 9-50 ది 1-23 |
| 14 | సో | ఏ 34-15 కృ 34-40 శూ 2-44 గ 53-56 ది 4-41 |
| 15 | మం | ద్వా 29-9 రో 31-32 వృ 49-33 కౌ 1-37 రా 12-39 |
| 16 | బు | త్ర 23-20 మృ 27-41 ధ్రువ 41-59 వ 23-20 రా 15-12 దక్షిణాయన [పుణ్యకాలం. |
| 17 | గు | చతు 17-1 ఆర్ద్రా 23-20 వ్యా 34-5 శ 17-1 రా 19-7 |
| 18 | శు | ● అమావాశ్య 10 26 పు 18-45 హర్ష 26-4 నా 10-26 రా 5-18 |

శ్రావణ మాసము.




జయజయ గృహలక్ష్మి సఖీ! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతిమా!
జయజయ లలనారత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయ కల్యాణీ!

# నమస్తే బాపూజీ



నమస్తే బాపూజీ!

లోకోద్ధారకులైన మహాత్ముల నారాధించడమే భారతీయ గృహలక్ష్ములకు పెద్దవంశుగ.

అర్ధశతాబ్దంగా కృషిచేసి, భారతస్వాతంత్ర్య లక్ష్మీకళ్యాణానికీ, తద్వారా ప్రపంచ కళ్యాణానికీ కారణభూతుడైన లోకారాధ్యునికి, మహాత్మునికి, భారతీయ పురంధ్రీమణులు జోహారు లర్పిస్తున్నారు. కరుణార్ద్రమైన హృదయ పుండరీకములతో, ఆనందబాష్ప శోభితమైన నేత్రాంబుజములతో, చలువల వెదజల్లు ముఖారవిందములతో, కృతజ్ఞతా మూర్తులై నిజజీవన జ్యోతుల వెల్గించి, కరకమలములబట్టి 'నమస్తే బాపూజీ' అని ఆయనకు నివాళి నిచ్చుచున్నారు.

తనభార్యాపుత్రులు మాత్రమే సహచరులుగా, అహింసా సిద్ధాంతమే కరదీపికగా, 50 సం॥ ల నాడు - సత్యాన్వేషణయాత్ర ప్రారంభించినాడు మోహనదాస్ కరంచంద్ గాంధీ. దక్షిణాఫ్రికా భారతీయసమస్య, చాంపరాన్, కెయిరా, రౌలట్ చట్టనిరసన

ఖిలాఫత్, బార్డోలీ, ఉప్పుసత్యాగ్రహము, శాసనోల్లంఘనము, హరిజనసమస్య, వ్యక్తి సత్యాగ్రహము, 'క్విట్ ఇండియా' ఉద్యమము - అన్నియు ఆసత్యాన్వేషణమున కుపకరణ మాత్రములే అయినవి గాని ప్రధానలక్ష్యము సత్యాన్వేషణముగానే యున్నది. 25 సం॥ ల నుండి, 40 కోట్లప్రజలు నిజవశవర్తులుగా నాయకాగ్రేసరుడై నడుపుచు, ఏపట్టునగూడా మొదట చేబట్టిన అహింసాకరదీపిక నార్పివైచి లోకము నంధకారబంధురం చేయలేదు. చూడరాని ఘోరములన్నీ చూచి, పడరాని ఇడుమలన్నీ పడి, క్షమానిలయమై, ఒకానొకాలము లోకముచే మెప్పుపొందిన ధర్మరాజు తుదకు

"..........................................వెం
పేదక క్రూరతకోర్వరాదు సిరినాకేలందు నేగ్రాసవా
సోదైన్యమువచ్చి నాయరయు నీచుట్టాలకున్ —"

అని యుద్ధమునకుదిగి బంధువులగొంతులు కోసినాడు. కాని మహాత్ముడో, - అహింసావ్రత మునుతప్ప అన్యథా బోధింపడు. భారతీయుల 'గ్రాసవా సోదైన్యము' తొలుగుటకు కలవారిని దోచుకొమ్మనడు. నిర్మాణకార్యక్రమ మవలంబించండి, అని బోధించును. స్త్రీ సహజముగా అహింసావ్రత; నైజముగా నిర్మాణకార్య కౌశలముగలది. కావుననే ఈ అహింసావ్రత నిష్టా గరిష్ఠుని, నిర్మాణ కార్యక్రమ ప్రబోధకుని, ఆమె నేడు 'నమస్తే బాపూజీ'అని హారతులిచ్చి ఆరాధించుచున్నది.

ఇన్నాళ్లుగా మహాత్ముని అనుచరవర్గంలో స్త్రీలున్నూ విశేషముగా మెరసినారు. పలుసత్యాగ్రహ సమరములలో వారు జైళ్లమగ్గుటేగాక, లాటీదెబ్బల రుచిచూచి, తుపాకి బారుల కెదురై నిలిచి, ప్రాణాలనుగూడా ధారవోసియున్నారు. బోర్సద్‌లో ఉప్పుసత్యాగ్రహమునాడు పోలీసులు 'లగావ్' 'లగావ్' అని లాటీలబాదియు, బూడ్సులదన్నియు, పిడికిళ్ల జుట్టుపీకియు ఎంత గాసిపెట్టినను, జండాలవిడువక, ఉన్నస్థలములనుండి కదలక, నేలకంటి 'గాంధీమహాత్మాకు జే' యని - సత్యాగ్రహము పూనిరట. ఇట్లు చిరకాలముగా "అబల" లని పేర్గాంచిన భారతస్త్రీలను సత్యాగ్రహవ్రతము బోధించి ప్రబలలను గావించి నాడు మహాత్ముడు. అందుకై వారాయనకు జ్యోతివెల్గించి, శిరములొగ్గి 'నమస్తే బాపూజీ' యని కీర్తించుచున్నారు.

స్త్రీ నైజముగా సంతానాపేక్షి కాని దేశము పరాధీనమగుటచే ఇన్నాళ్లున్నూ ఆమెకన్న సంతానము బానిసజాతియైనది. ఇకపైనామెకు బానిసల కనిపెంచవలసిన బాధ

తప్పించి, స్వతంత్రులగు సంతానముల పొందనవును కల్పించినాడు. అబ్బురమా ? ఆమె కర్పూర నీరాజనములిచ్చి, 'నమస్తే బాపూజీ' అని వినముని రాలైనది.

మహాత్ము డిన్నాళ్లుగా తన ఆదర్శసిద్ధికై ఎన్నోసార్లు జైళ్లపడి క్రుగ్గినాడు. నిరంతర సంచార ప్రచారముల నలుగుతున్నాడు. సర్వసంగ పరిత్యాగియై సన్యాసియైనాడు. అన్ని విధాల తన సహధర్మచారిణియై మెలగిన కస్తూరిబానుగూడ జైలున ధారవోసుకొని ఏకాకియైనాడు. ఎన్నోసార్లుపవాస మొనర్చి కృతార్థుడైనాడు. నిన్న మొన్ననే నౌఆకలీ యందు హిందూస్త్రీలు పడ్డబాధలువిని మాళవ్యా పండితుడు నిప్పులుగ్రక్కి, ప్రాణాలు వదిలినాడు. కాని మహాత్ముడు నిప్పులుతొక్కుకొనుచు, పాదరక్షలులేక, పాదచారియై, పాదములు బొబ్బలెక్క ఊరూరికివెళ్లి, వారి గోడెల్ల స్వయముగావిని, బుజ్జగించి, వారి కన్నీళ్లు తుడిచినాడు. నిర్జనప్రదేశముల, పూరిగుడిసెల, ఒంటరిగా నివసిస్తూ, వారికిధైర్యము గొల్పి తిరిగీ ఇండ్లకురండని ఆహ్వానించినాడు. కావుననే భారతనారీలోకము అప్రయత్నంగా 'నమస్తేబాపూజీ' అని ఆ మహాత్ముని పాదపద్మములకు మ్రొక్కి దివ్వెనెత్తిపట్టుచున్నది.

నేడు వైస్రాయి ప్రకటనవల్ల, ఏమైనా, కాకున్నా, - హిందూ రాష్ట్రములైనా స్వాతంత్ర్యము పొందగలవు. స్వాతంత్ర్యసిద్ధితో, మిగతవారిపని తీరునేమోగాని మహాత్ముని పనితీరదు. ఆ స్వాతంత్ర్యము సుఖసంతోషములకు మూలమగుటకై భారతీయులు నిర్మాణపూర్వకమగు కృషి చేయవలసి యున్నది. అందు మహాత్మునికి హెచ్చుగాతోడ్పడ గలవారు స్త్రీలే. కావున భారత మహిళామతల్లులందరును, ఆపని నెరవేర్పగలందులకై ఆయనయే కోరునట్లు 125 సం॥ జీవించుగాకయని దీపముచూపి, దండముపెట్టుట సకల శ్రేయములకు మూలము.

మరొక్క ప్రమాదమున్నది. పై ప్రకటనవల్ల అనివార్యముగ భారతదేశము విభాజ్యము కానున్నది. దానిచే హిందూముస్లిములకు సఖ్యమమరునో, సంఘర్షణమే హెచ్చునో, మహాత్ముడే సంశయించుచున్నాడు. అట్లు హింసాకాండ తిరిగి చెలరేగునేని మహాత్ముడు మరల ప్రాయోపవేశ మొనర్చుట ఖాయమని తోచుచున్నది. ఇప్పటికాయన ఉపవాసమును 10 సార్లుపూని కృతకృత్యుడైనాడు. అయితే అందుకాయన తపఃఫలముతోపాటు, పతివ్రతా తిలకమగు కస్తూరిబా మాంగళ్య మాహాత్మ్యమును తోడ్పడినవి. నేడది కరవైనది. అట్టి గండకత్తెర సమయమున — అయిదువలెత్తు ఈ హారతులును, మహాత్ముని పరముగా ముక్కోటిదేవతలకు మ్రొక్కు మ్రొక్కులునే - మనలోకారాధ్యునికి శ్రీరామ రక్ష !

నమస్తే బాపూజీ!



# మౌంట్‌బ్యాటన్ మధ్యస్థం



ఉభయవాదులకు, పరిపూర్ణతృప్తి కలుగచేయు రాజీ ఇదివరకు ఏమహనీయుడు చెప్పియుండలేదు. అట్టిరాజీ మనుష్యమాత్రుడు చెప్పలేడు. రాజీకివుండవలసిన ముఖ్యగుణము ఏమనిన ఉభయవాదులు ఆవిధానమును ఒప్పుకొనుటయే. అప్పుడే ఆసమాఖ్య సార్థక మగును. అట్టి అంగీకారమున్నచో ఆవిధానము ధర్మానుగుణ్యముగవున్నదా, కార్యభాగములో చక్కగానెరవేరగలదా యన్నవిషయములపై ఆలోచన అనవసరము. ఈదృష్టితోనేమనము మౌంట్‌బ్యాటన్ ఏర్పరచినపద్ధతిని ఆలోచింపవలయును.

ఏదిఎట్లున్నను కాంగ్రెస్‌వారు, ముస్లిములీగ్‌వారు ఈప్రణాళికను అంగీకరించినట్లే కనుపించుచున్నది. అదియే మౌంట్‌బ్యాటన్ విధానమునకు గలగొప్పగుణము.

మౌంట్‌బ్యాటన్ విధానతత్వమును, నిర్వచనము చేయుటకుముందు కొన్ని విషయములను ఆలోచింపక తప్పదు. కాంగ్రెస్ వారికి, లీగ్‌వారికివున్న కలహమేమిటి? ఆకలహముయొక్క తత్వమేమిటి? ఆకలహమును పరిష్కరించుటకు వారిరువురు ప్రతిపాదించిన ఉపాయములేమిటి? ఈవిషయములు కొంతఆలోచించినకాని ఇప్పుడుమౌంట్‌బ్యాటన్ చెప్పినరాజీయొక్క విలువ తెల్లముకాదు.

కాంగ్రెస్‌వారివలెనే లీగువారుకూడా ఆంగ్లేయప్రభుత్వము అంతరించి పరిపూర్ణస్వతంత్రము ఇండియాకు కావలెననికోరుచున్నారు. బ్రిటిషువారుకూడా 1948 వ సంవత్సరం జూను ఒకటవతేదికి తమ యధికారమును పూర్ణముగ సమాప్తముచేయ సంకల్పించియున్నారు. కనుక అసలుప్రధాన ఆశయముపట్ల కాంగ్రెస్‌కు, లీగ్‌కు, బ్రిటిషుప్రభుత్వమునకు భిన్నాభిప్రాయములేదు.

ఇకవచ్చిన కలహమంతా ఆవుద్దేశమును నిర్వర్తించుటలోనే. మహమ్మదీయులు వేరేజాతియనియు, వారిమత, సాహిత్య, ఆర్థికవిషయములలో అధికసంఖ్యాకులగు హిందువులకు లోబడక సంపూర్ణస్వాతంత్ర్యము కావలయుననియు వారుచేయుఆందోళన అందరికితెలియును. దాని ననుసరించియేవారు పాకిస్థాన్ ఆశించుట.

జిన్నాసాహేబుగారు ఆపాకిస్థాన్‌యొక్క స్వభావమును కాని, దానిహద్దులనుకాని చాలాకాలము నిర్వచనము చేసియుండలేదు. 1940 వ సంవత్సరములో జరిగిన ముస్లిమ్‌లీగ్ తీర్మానము పూర్వపశ్చిమ ముస్లిమ్ భాగములను పూర్ణస్వతంత్ర రాజ్యములుగ నిర్మింపవలయునని మాత్రమేయున్నది.

1944 వ సంవత్సరం సెప్టెంబర్‌నెలలో గాంధీగారు జిన్నాగారితో రాజాజీ సూత్రములవిషయమై సంప్రదించినపుడు, ముస్లిమ్‌లీగ్‌వారు ఏఏరాష్ట్రములను కోరునది వెల్లడాయెను. పశ్చిమములో పశ్చిమోత్తర సరిహద్దురాష్ట్రము, సింధు, పంజాబు, బెలూచిస్థాన్‌లు; తూర్పున, బెంగాల్, అస్సాము రాష్ట్రములు పాకిస్థాన్‌లో చేరవలసినట్లుగా జిన్నాసాహెబ్‌గారు తెలిపిరి.

ఆపద్ధతికి ఆక్షేపణలు తీవ్రముగాఏర్పడెను. అనేకులకు మనదేశమును విభజించుటయే విషాదకరమైన విషయము. పలువురు విభజనసూత్రములకు వొప్పుకొనినను జిన్నాసాహెబ్‌గారు కోరినపద్ధతి అన్యాయమనియు, అప్రస్తుతమనియు అభిప్రాయపడిరి. పంజాబులో సట్లెజ్ నదికి తూర్పుగావున్నజిల్లాలన్నిటిలోను

హిందువులు అధికసంఖ్యాకులుగవున్నారు. అదేవిధముగ బెంగాలులోపశ్చిమభాగమునవున్న జిల్లాలన్నిటిలోను హిందువులేఅధిక సంఖ్యాకులుగవున్నారు. మహమ్మదీయప్రాబల్యము కలభాగములను ప్రత్యేకరాష్ట్రములుగ కోరెడిహక్కు లీగ్ వారికుండిన వుండుగాక; హిందువులధికసంఖ్యాకులుగవున్న భాగములనుకూడ పాకిస్థాన్‌లో చేర్చుట ఏమిన్యాయమన్న వాదమునకు జవాబులేదు. జిన్నాసాహెబుగారి అభిప్రాయప్రకారము పాకిస్థాన్‌కు కావలసిన ఆర్థికబలము తానుకోరిన రాష్ట్రములన్నియు వుండిననేకానికలుగదు. పాకిస్థానముయొక్క ఆర్థికబలమును నిలుపుటకు హిందువులు ఎందులకు సహాయముచేయవలయునో జిన్నాగారు తెలుపలేదు; తెలుపలేరు. అశకు అంతమెక్కడయున్నది?

ఈవాదప్రతివాదములు ప్రబలి దేశములో అల్లరులు బయలుదేరినవి. గతసంవత్సరము మేనెలలో బ్రిటిష్ మంత్రివర్గమువారు వొక రాయబారమునుపంపిరి. వారుప్రతిపాదించిన విధానము మాచదువరులకు తెలిసియేయున్నది. అందులో కాంగ్రెస్‌వారికిని, లీగ్ వారికిని అరచేతిలోనే వైకుంఠముచూపబడినది. సంయుక్తదేశమును కోరుకాంగ్రెస్‌వారికి అఖండఇండియాసమ్మేళనము చూపబడినది. వ్యక్తిస్వాతంత్ర్యమును కోరులీగ్ వారికి గ్రూప్‌కాన్‌స్టిట్యూషన్ (Group constitution) చూపబడినది. పాకిస్థాన్ నిరాకరింపబడెను. అన్నమాటతో హిందువులందరు సంతోషించిరి. గాంధీగారు బ్రిటిష్‌మంత్రుల ప్రజ్ఞను కొనియాడిరి. సణుగుచు జిన్నాగారుకూడా ఆప్రణాళికను వొప్పుకొనిరి.

అనతి కాలములోనే వ్యాఖ్యానము బయలుదేరినది. వ్యాఖ్యానముతో భిన్నాభిప్రాయములు ప్రస్ఫుటమైనవి. హిందూమెజారిటీగల అస్సామును బెంగాలతో కుడచేర్చి వొకటేగ్రూప్ క్రిందకలుపుటకు అస్సామువారుకాని, కాంగ్రెస్‌వారుకాని వొప్పుకొనలేదు. అందుచేతనే కాంగ్రెసువారు, రాష్ట్రములు తాము ఇష్టపడిననే గ్రూప్‌లోచేరవలయునని పట్టుపట్టిరి. దానికిప్రతిగా లీగ్ వారు గ్రూప్‌రాజ్యములు, రాష్ట్రములఅంగీకారముమీద ఆధారపడినచో ప.ఉ. పరగణాలు, అస్సాముగ్రూప్‌లలో చేరవనియు అట్లు చేరకపోయినచో ముస్లిములకిచ్చిన కొద్దిలాభముకూడా పోవుననియు వాదించి బ్రిటిష్‌మంత్రుల ప్రణాళికను నిరాకరించిరి. రాష్ట్రములకు గ్రూపులో చేరకుండుటకు స్వాతంత్ర్యమున్నదా, లేదాయన్నచర్చ గొప్పగా జరిగినది. బ్రిటిష్‌ప్రభుత్వమువారే కవిహృదయమును తెల్లముచేయవలసి వచ్చెను.

ఈకల్లోలములలో కాంగ్రెస్‌వారు, తమ ముఖ్యఅభిప్రాయమును వెల్లడి చేసిరి. కాంగ్రెస్ సంస్థ స్వేచ్ఛకై 60 సంవత్సరములు కృషిసల్పినది. ఆస్వేచ్ఛ యావద్భారత దేశమునకు చెందవలయునని వారి సంకల్పము. కాని ఇష్టములేని వారిని, బలాత్కరించి దేశీయ ప్రభుత్వములో చేర్ప వారెప్పుడును తలంపలేదు. అట్లుచేయుట కాంగ్రెస్‌నకు ముఖ్య ఆదర్శమగు స్వేచ్ఛారూపమునకు విరుద్ధము కనుక కాంగ్రెస్‌వారు రాష్ట్రములకు స్వయం నిర్ణయాధికారము వుండవలయునని వొప్పుకొనిరి.

కాన కాంగ్రెసు అభిప్రాయమును అనుసరించిన మౌంట్‌బ్యాటన్ చెప్పిన మధ్యస్థమును మనము వొప్పుకొనకతప్పదు.

సింధు, బెలూచిస్థానము, పంజాబులలోని ముస్లిము ప్రతినిధులు గాని, బెంగాల్, అస్సాము ముస్లిము ప్రతినిధులు కాని, ఇప్పటి నిర్మాణసభలో కూర్చుండుటలేదు. అందుచేవారికి ప్రత్యేకముగా వొక రాజ్యాంగ నిర్మాణసభ సూచింపబడివున్నది హిందూ ప్రాబల్యముగల జిల్లాలు, పంజాబ్ నుండియు, బెంగాల్ నుండియు తొలగింపబడినవి. ఇది పంజాబ్‌లో సిక్కులకు, హిందువులకు, బెంగాల్‌లో హిందువులకు అనుమతమే. అసలు ఈవిభజన ఆయారాష్ట్రములకు చెందిన హిందువులే కోరిరి. పశ్చిమోత్తరపరగణా విషయమే ప్రత్యేకముగ ఆలోచింపబడినది. ఆరాష్ట్రములో నూటికి తొంభైమంది మహమ్మదీయులు. కాని అచ్చట అమలులోవున్నది కాంగ్రెస్ ప్రభుత్వము. ఆ ప్రభుత్వమును నిరోధించుచు, లీగ్ వారు తీవ్రమైన ఆందోళనము సలుపుచున్నారు. అందుచే వోటర్లకందరికి తమ అభిప్రాయముల తెలుపు Referendum ప్రతిపాదింపబడెను. ఇది ఎందులకో అర్థము కాదు. మరిదేశములోని పదిరాష్ట్రములు శాసనసభలమూలకముగా తమ అభిప్రాయములు వెల్లడిచేయ జాలునపుడు పశ్చిమోత్తరపరగణాలకు మాత్రము, వేరు ఏర్పాటుచేయుటలో వుద్దేశము జిన్నాగారిని తృప్తిపరుచుట తప్ప మరేమికాదు. పఠాణులకు తమకు ప్రత్యేకరాష్ట్రము సర్వహక్కులతోటి కావలయునన్న ఆశయము కూడా కొనసాగు మార్గము కనుపించదు. కాంగ్రెస్‌వారు లీగ్ వారు వొప్పుకొనిన కాని పశ్చిమోత్తరపరిగణాల పాకిస్థాన్‌కు, హిందూస్థాన్‌కు చెందక వ్యక్తి స్వాతంత్ర్యము పడయజాలదు. అన్నివిధముల జిన్నాగారి తృప్తికొరకు ఆరాష్ట్రమునకు తీరని అన్యాయము చేయబడినది,

పంజాబ్ బెంగాల్ రాష్ట్రముల విభజన ఇప్పటి పరిస్థితులలో తప్పదాయెను.

ఈవిధానములోని లోపములు సులభముగా కనిపించుచునేయున్నవి. మొదటిది దేశమును ఖండించుట. ఇప్పటి ఆందోళనములలో ఐక్యదేశము వొకటున్నదా యన్న సందేహము అనేకులకు గలుగక మానదు. దేశములోని ఐక్యతకు పునాది ఏకజాతీయభావము. ఆభావములేనప్పుడు దేశీయఐక్యతకు బలము లేదు. ఆఫ్గనిస్థానము అనేకశతాబ్దములు భారతదేశముతో కలసియుండెడిది. గతశతాబ్ద మధ్యములో వేరైపోయినది. మొన్నటి వరకు బర్మాదేశము ఇండియా ప్రభుత్వము క్రిందనే యుండినది. అదియు వీడిపోయినది. అట్టిదియే ప్రస్తుతపు విభజనకూడాయని ఏలయనుకొనరాదని యడుగ సాహసింపవచ్చును.

రెండవలోపము ఏమనిన హిందూస్థానము బాహుళ్యమైన రాజ్యము కాగలదనియు, పాకిస్థాన్ చాలా చిన్నబీదరాజ్యము కాగలదనియు, అందుచే మహమ్మదీయులకే నష్టముకాగలదనియు, పలువురు హిందువులే చెప్పుచున్నారు. ఈవిషయము ఆవేశము తగ్గినపిమ్మట మహమ్మదీయులే తెలుసుకొనవలసిన విషయముకాని, ఇప్పుడు హిందువులే చెప్పుటలో ప్రయోజనములేదు.

ఈరాష్ట్రవిభజనయే, పంజాబ్ బెంగాల్ రాష్ట్రవిభజనయే పాకిస్థాన్ వాదులకు ప్రకోపము తగ్గించి యదార్థవాదులుగా చేయగలదను ఆశ పండితనెహ్రూ సూచించియున్నాడు.

ఆ ఆశతో భారతదేశపు కల్యాణమును కోరువారందరును అంగీకరించకతప్పదు. ఏది ఎటులున్నను ఈతీవ్రవాదములు తగ్గి భారతదేశము బ్రిటిష్ యధికారులనుండి విడుదల కలుగుటకు సహాయపడునేని మౌంట్‌బ్యాటన్ చెప్పిన మధ్యస్థము సార్థకమగును.

# ముఖచిత్రప్రశంస

ముఖపత్రంలో చిత్రింపబడ్డ 'నమస్తే బాపూజీ' అనేచిత్రం సుప్రసిద్ధ ఆంధ్ర చిత్రకారులు శ్రీ యస్. యన్. చామకూర్ (చామకూర సత్యనారాయణ)గారు చిత్రించారు. బాపూజీ 1946 జనవరిలో దక్షిణభారత హిందీప్రచారసభ రజితోత్సవాల సందర్భంలో చెన్నపురికి వేంచేశారు. ఆ ఉత్సవాలతోపాటు రచయితల, కళోపాసకుల సభకూడా జరిగింది. ఆ సమావేశంలో ఈ చిత్రం ప్రదర్శింపబడినది. అప్పుడు దీన్నిచూచి చాలామంది చాలా సంతోషించారు.

అందమైనవీ, ఆదర్శపూర్వకమైనవీ చిత్రాలు కనిపిస్తే, ఏరి, కోరి, ఎంతైనా వెచ్చించితెచ్చి, "గృహలక్ష్మి" పుటల ముద్రించడం శ్రీ కేసరిగారికి ఆనందం.

శ్రీ చామకూర్‌గారి కళానైపుణ్యం పొగడదగినది. ఈకాలంలో నిరాడంబరమైన భక్తివిశ్వాసాలతో కళోపాసనజేసే కొద్దిమంది ఆంధ్రయువకులలో వీరొకరు. వారు చిత్రించిన వివిధచిత్రాలు చాలామనోహరంగా ఉంటాయి. చాలామంది పెద్దల పూర్తి మూర్తి చిత్రపటాలనుగూడా నైజకళలుట్టిపడేట్టు వ్రాసిఉన్నారు. వీరి చిత్రశాలను సందర్శించిన శ్రీ హారీంద్రనాథ చటోపాధ్యాయులవారు- "మీచిత్రాలు ఆంధ్రులంతా గర్వించదగినవి."—అన్నారు.

శ్రీమతి సరోజనీదేవిగారు "యాదాలాపంగా చూచినా మీరు గీచినరేఖలో సౌందర్యం కండ్లకు కట్టినట్టుకన్పిస్తుంది." అన్నారు.

ఈ అభిప్రాయాలు రెండున్నూ వీరికీర్తిని, నైపుణ్యాన్ని వేనోళ్ల చాటుతున్నాయి.

అయితే, ఈ "నమస్తేబాపూజీ" చిత్రించడంలో శ్రీ చామకూర్‌గారు మానవుని ఊహను యదార్థంలోనుంచి పరమార్థంలోనికి నడిపించారు.

శ్రీ చామకూర్‌గారికి ఈచిత్రమారంభంగా బాపూజీ జీవితగాధనంతా పలుచిత్రాలలో చిత్రించాలని సంకల్పముట. బుద్ధునిచరిత్రను రంగులలో చిత్రించి, రాళ్లలోమలిచి, జీవంపోసి అజంత, ఎల్లోరాగుహాలలో శాశ్వతంగానిలిపినకీర్తి ఆంధ్రులదే. నేడు చామకూర్‌గారి సంకల్పమే నెరవేరితే, అభినవబుద్ధుని చరిత్రనుగూడ చిత్రలేఖనంలో పొందుపరచిన గౌరవమున్నూ ఆంధ్రులదే అయి, వారి ప్రాచీనకీర్తిలత తిరిగీ చిగిర్చి, మొగ్గ తొడుగుతుంది.

ఈ పాఠశాలలో చేరిన బాలికలు హైస్కూలు తరగతులవరకును వచ్చి యున్నారు. హైస్కూలు తరగతులకు వచ్చిన బాలికలు బాలురతో కలసి చదువక తప్పని సరియగుట న్యాయము కాదని నామతము. అట్లనివారు విద్యాభ్యాసము మానుటయు నాకు ఇష్టములేదు. అందుచేత, పాఠశాలను చూడవెళ్లినప్పుడెల్లా, ఉన్నత తరగతుల చదువు బాలికలచూచు కొలది, వీరికిప్రత్యేక పాఠశాల ఏర్పడి స్వేచ్ఛగా చదువవీలైన బాగుండునని అనిపించెడిది. ఆభావమునకు నేను పలుమారు వచించునట్లు కారణాంతరములచే స్త్రీల అభ్యున్నతి ఎడల నాకుగల ప్రత్యేకాభిమానమును జోడై ఈ "కేసరీకన్యా విద్యాలయము" అనే నామకరణముగా పరిణమించినది. రూపములేనిది పేరునిలువదుగాన-తొలుతగా లక్షరూపాయలతో రూపము కల్పించితిని.

మొదట నేను చేతబట్టి నడిపించుచున్న "కేసరీహైస్కూలు" ను నేనొక్కడనే నిర్వహించుచున్నాననే అహంకార మమకారములు నన్నలుముకోకుండా, ఇతర దాతలను అర్థించుచు వారిచ్చు విరాళములను కమిటీవారము గైకొనుచున్నాము. చెన్నపురిలో గల నొక ముఖ్యసమస్యను తీర్చుటకై ఏర్పడిన ఈసంస్థకొరకు యావదాంధ్ర దేశవాసులును విరివిగా విరాళము లిత్తురుగాక అని ఇది అవకాశముగా కోరుచున్నాను.

నా ఎరుకలో సుమారొక అర్ధశతాబ్దముగా ఆంధ్రదేశమున నే ధర్మసంస్థ ఏర్పడినను దానితాలూకు భిక్షాపాత్ర మద్రాసునకు తప్పకవచ్చితీరవలసినదే. ఇచ్చటగల మిగత ఆంధ్రులతోపాటు సామాన్యముగా నేనును, ఆభిక్షా పాత్రమున యథాశక్తి తృణమో ఫణమో అర్పించు కొనుచునే యున్నాను.

కావున ఈవిషయమైనాకు లేఖలవ్రాసిన వారును, ఇతరులును, నన్నన్యథా తలంపక, అవసరమైన సంస్థలకై స్థానికముగా తీవ్రప్రయత్నములు గావింపగోరెదను.



# తల్లి - పిల్ల — ప్రసూతి - శిశుపోషణ

★ శ్రీ పసుపులేటి కోటేశ్వరరావుగారు ★

(౦) —

ప్రకృతి బద్ధయగు ప్రతి స్త్రీ జీవితానికీ పరిపూర్ణత సిద్ధింప జేసేది మాతృత్వం. కాని, లభ్యమైన మాతృత్వాన్ని మూఢనమ్మకాల వల్ల, అజ్ఞానం వల్ల దుర్వినియోగం చేసే స్త్రీలు ప్రస్తుతం మనదేశంలో యెందఱో వున్నారు. ఇలా దుర్వినియోగం జేసి మూర్ఖంగా ప్రవర్తించటం వల్ల సంభవించే అనర్ధాలు అనుభవించేందుకు నిరపరాధియైన శిశువు భావిలో సిద్ధపడాలి-కాని స్త్రీలు తగుశ్రధతో వర్తించినట్లయితే శిశువును యీ అనర్ధఫలితాల బారినుండి కాపాడి తమ పవిత్రమాతృత్వాలను మెరుగుపెట్టుకోవచ్చు.

పిల్లల భావికోసం తాపత్రయపడే తల్లుల కార్యక్రమాన్ని ఉపకరించే రీతిగా కొన్నిసలహాల నిస్తున్నాను. ఆచరించిన ప్రతివారికీ ఫలితం సమకూడి తీరుతుంది.

బిడ్డ జన్మించగానే కళ్లగురించి అమిత జాగ్రత్త తీసుకోవటం చాలా అవుసరం. జ్ఞానేంద్రియాల్లో ప్రముఖమైనదైన చక్షువు లోపిస్తే శిశువు జీవితం యావత్తూ చిమ్మచీకటే! ఈసమస్యను యెదుర్కొనే నిమిత్తం శిశువుకు జన్మ కలగడంతోనే కళ్లల్లో 1% సిల్వర్ నైట్రేట్ వెయ్యాలి. ఈమందు పిల్లకళ్లల్లోకి ప్రసూతి సమయాన తల్లి గర్భకోశంనుండి ప్రవేసించిన విషక్రిములను చంపుతుంది. ప్రత్యేకించి కొందరు సుఖవ్యాధులున్న స్త్రీలకు జన్మించే శిశువులకు తప్పని సరిగా యీ మందు వాడితీరాలి, లేకుంటే గంట గంటకూ వ్యాధి అభివృద్ధి జెంది కొన్నాళ్లకు కళ్లుపూర్తిగా పోతాయి.

రెండో ప్రముఖ విషయం : పుట్టిన వెంటనే శిశువులో అవయవలోపాలేమేనా ఉన్నాయేమో పరీక్షించటం. కొందరు విరేచనద్వారం లేకుండా జన్మిస్తారు. ఇది తక్షణం శస్త్ర చికిత్సద్వారా సరిదిద్దవచ్చు. పరీక్షించటంలో ఆలస్యమైనా, చికిత్సలో నిర్లక్ష్యమైనా శిశువు అసువులకు అపాయం సమకూరుతుంది.

సామాన్య గృహాల్లో బిడ్డజన్మించగనే పెద్దలనుకొనేవాళ్లు యెంతో మూర్ఖంగా ప్రవర్తిస్తారు. పిల్లగర్భకోశంనుండి బయటపడగానే నిర్దాక్షిణ్యంగా, కటువుగా బలాన్నంతా ఉపయోగించి స్తనాలు గట్టిగా ఒత్తి పిండివేస్తారు. ఇది చాలాతప్పు. ఒక్కొక్క చెడుసమయంలో యీపని ప్రమాద పరిస్థితుల్లోకిన్నీ దారితీయవచ్చు. బిడ్డస్తనములు పెద్దవిగా వుండటం వల్లగాని, వాటిద్వారా ఒక రకమగు నీరుకారుతూ వుంటం వల్లగాని, ఏలాటి అపాయమూ లేదనే సత్యాన్ని తల్లులు గమనించాలి - నమ్మాలి!

బిడ్డపుట్టే పుట్టటంతోనే ఆకలితో అలమటించి పోతుందనే భ్రమతో పెద్దలు అనారోగ్యకరమైన పాలను తెచ్చిపోస్తారు. యీ అదనపు ఆహారంవల్ల బిడ్డ చాలా బాధపడుతుంది. ఏమంటే జన్మించేటప్పటికి శిశువు శరీరంలో మూడుదినాలవరకూ సరిపడే ఆహారం నిల్వవుంటుంది. అదీగాక ప్రసూతి ప్రయాణం వల్ల అమితంగా అలసి వుండే శిశువు ఆహారం తీసుకోలేదు. కాచి చల్లార్చిన నీళ్లు కొంచెం తేనెతోగాని, గ్లూకోస్‌తోగాని మిళితంచేసి ఇవ్వటం మంచిది.



# "గాంధీ"

భారతీయులలోని - బానిస భావంబు
దొడ్డిదారిని బెట్టి - ద్రోలినావు
భారతభూమిలో - బలసిపోయిన యట్టి
సామ్రాజ్యవాదంబు - జంపినావు
భారత ప్రజలకు - బాధలన్నియు బోవ
'శాంతి' మార్గమటంచు - జాటినావు
భారతీయుల భోగ - భాగ్యంబులన్నియు
కదురు కవ్వాలలో - పొదిపినావు

బానిసత్వంబు బాపగా - బాధలెన్నొ
పడియుపట్టిన శపథంబు - వీడబోక
అన్నహారాలమానుచు - నిన్నినాళ్ళు
గడపినావయ్య శ్రీవర - గాంధితాత ॥

— దీక్షి కామేశ్వరీదేవి.



# పరిమిత దానధర్మములు

కే. ఎన్. కేసరి.

ఇటీవల "కేసరీ కన్యావిద్యాలయము" నకై నాశక్తికి మించినను లక్షరూపాయలను దానమొనర్చితి ననువార్త విన్నతోడనే నన్ను తెలిసిన వారును, తెలియనివారును పలువురు స్త్రీపురుషులు నన్నభినందించుచు దీర్ఘలేఖల వ్రాసి యున్నారు. వారికి వినమ్రముడనై కృతజ్ఞత తెలుపుచున్నాను.

వారాలేఖలలో నాకు కొన్ని సలహాలు కూడ నిచ్చియున్నారు. వాటన్నిటి సారాంశ మేమనగా, నేను నాదానధర్మములను చెన్నపురిలోనే కేంద్రీకరించుచున్నాను అనియు, జిల్లాలయందలి పట్నములలో గల పలుసంస్థలు కూడ ఆదరించదగిన వనియు వారి ముఖ్యాభిప్రాయము.

అతివ్యాప్తముగా రాష్ట్రమంతటా దానధర్మము గావింప దగినంత కోటీశ్వరుడను గాను; సామాన్యుడను మాత్రమే అని మీకందరికి తెలిసిన సంగతే. చాలనివాడు డాంబికమునకై అతివ్యాప్తముగ దానధర్మములు గావించినచో అవి ఎందునా పొందక అందతుకుల బొంతలవలె పరిణమించునని నా అభిప్రాయము.

కావున నాశక్తికొలది నేను ఈ 60 సం॥ లుగా అభివృద్ధిగాంచిన ఈ చెన్నపట్నము ననే స్థిరమగు నేదైన యొకటి రెండుపనులు చేతామని సంకల్పించితిని. నేను ఇచ్చటికి వచ్చిన రోజులలో ఆత్మగౌరవముతో పేదవిద్యార్థులు చదువు సాగించుట దుర్ఘటమై ఉండెను. పట్నమున తమిళ జనసంఖ్య హెచ్చుకొలది క్రమముగా తెలుగు బాలబాలికలకు తెలుగున విద్యాభ్యాస మొనర్చు అవకాశములు క్లుప్తమగుట స్వయముగాచూచుచుంటిని. అందుచే అన్నియు సమకూరునట్లుగా అప్పటికే యేర్పడి యుండిన తెలుగు పాఠశాల నొకదానిని చేబట్టితిని. అదినేడు హైస్కూలు దశకువచ్చినది. రాష్ట్రీయ విద్యా చట్టము ననుసరించి అది ఎంతవరకు అభివృద్ధిచెంది ఏ ఏ దశల కెక్కదగునో ఆయా అవి నెరవేర వలయునని నా కోరిక.

అనుభవశాలురు మనుకునే అనేకులు శిశువు జన్మసమయాన శరీరంలో మూడుదినాలకు సరిపడే ఆహారం నిల్వవుంటుందనే సత్యవాక్కును క్షణమాత్రం నమ్మరు. కాని ఈవిషయాన్ని ప్రకృతి ప్రవృత్తే చాటుతోంది. ప్రసవించిన స్త్రీ స్తనాల్లో మూడుదినాలవరకూ పాల ఊట బయల్దేరదు. ఈవిషయాన్ని సమగ్రంగా గుర్తించకుండా, మూఢాచారాలనునమ్మి, ఆవుపాలనో, దనుపాలనో తెచ్చి బిడ్డగొంతులో బలవంతానపోసి, అవి జీర్ణమయేందుకు ఆముదము గూడా వాడుదురు. ఇందువల్ల యెక్కువచెడుగు సంభవించడానికి అవకాశాలున్నాయి.

విరేచన బద్ధకాన్ని పరిష్కరించటానికి ఆముదం వాడవలసి వస్తుందని అనుభవజ్ఞులు సమర్థించుకో ప్రయత్నిస్తారు. ఒకవేళ శిశువు యీసమస్య వల్ల అవస్థపడుతున్నా ఆముదం మాత్రంపెట్టగూడదు. దీన్ని పరిష్కరించేందుకు పుట్టిన దినంనుంచే పిల్లకు తల్లిచేత పాలిప్పించాలి. స్తనముల్లో పాలులేకున్నా-అందులోంచి ద్రవించే జీరే శిశువు ఆరోగ్యరక్షణకు అప్పట్లో చాలా అవుసరంగా-అందులో విరేచన మయే గుణమేగాక కొన్ని అత్యుపయోగకరములైన విటమినులు కూడా వుంటాయి. అదీకాక స్తనములు పిల్లనోటికి తగిలితే తల్లిగర్భకోశం త్వరగా మూసుకుంటుంది. అందుచేత ఈవిధంగా పాలిప్పించటం వల్ల తల్లికీ పిల్లకీ ఇద్దరికీ అనన్యంగా ఉపకరిస్తుంది.

మిగతా ఏ ఇతర ఆహారపదార్థాలైనా పిల్ల ఆరోగ్యానికి తల్లిపాలతో సాటిరావు. బిడ్డలను వివిధ సంధిగాలనుండి రక్షించేందుకు యీపాలు అమృతంలా పని చేస్తాయి. సంవత్సరంలోపు పిల్లలను రక్షించే వజ్రాయుధమే యీతల్లిపాలు. కాని బిడ్డకు ఉపకరిస్తుందిగదా అని యీపాలను అదే పనిగా సంవత్సరం వయస్సు తర్వాత గూడా ఇప్పించగూడదు. అందువల్ల తల్లి శుష్కించి పోతుంది. శుష్కించి పోయిన తల్లివల్ల, పిల్లకు యెక్కువ ఉపయోగం సైతం వుండదు.

కాని యీపాలు మాన్పించడం మనేది అనుకొన్నంత తేలికైన పనిమాత్రం కాదు. ఇదిబిడ్డకూ తల్లికీ ఇద్దరికీ గడ్డు సమస్యే! ఏమైనా కొద్దికష్టంతో, ఆవుపాల సాయంతో యీసమస్యను పరిష్కరించవచ్చు.

ఆవుపాలకు తల్లిపాలకు చాలా దగ్గరి చుట్టరికం వుంది. చాలావరకు యీపాలు తల్లిపాలతో సమంగా పనిచేయ గలవు. ఆవుపాలను తల్లిపాలతో పోల్చి చూస్తే వివిధ పదార్థాలు యీక్రింద విధంగా వుంటాయి:

| | ఆవుపాలు | తల్లిపాలు | |
|---|---|---|---|
| నీరు: | 87.75% | 87.5% | మిగతావి ఖనిజాలు |
| పప్పు: | 3.5% | 1.4% | |
| పంచదార: | 4.6% | 6.8% | |
| కొవ్వు: | 3.4% | 4% | |

గేదెపాలలో ఆవుపాలలో కంటె ఒకటిన్నర రెట్లు యెక్కువ కొవ్వు వుంటుంది. సంవత్సరం లోపు పిల్లకు కొవ్వు హాని చేస్తుంది. కనుక, ఆవుపాలనే సగపాలు నీటితో కలుపుతూ తల్లిపాలతో సమంచేసి, క్రమేపీ అలవాటు చేస్తూ ఏడాదిలోగా తల్లిపాలు సంపూర్తిగా మాన్పించి వేయాలి.

ఒకసంవత్సరం వరకూ శిశుపోషణ విషయంలో యీ జాగ్రత్తను తప్పనిసరిగా అవలంబిస్తే, శిశువు భావికి తల్లిద్రోహంచెయ్యని దౌతుంది. తెలిసికోగల స్త్రీకి తన మాతృత్వాన్ని మలిన పరుచుకోలేదనే సంతృప్తి సైతం మిగులుతుంది.

# వరవిక్రయం — తెనుగుతల్లులకు — తీరని కళంకం కాదా?

శ్రీ హరికృష్ణగారు

వరకట్నం-కాదు వరవిక్రయం. ఈ దురాచారం ఏనాడో మన సమాజికజీవితంలో మొలకెత్తింది. ఈనాడు ఒక మహావిషవృక్షమై వేళ్లు పాదుకుపోయింది ఈవిష వృక్షచ్ఛాయలలో ఎన్నో నిండుప్రాణాలు, ఎన్నో మధ్యతరగతి కుటుంబాలు నేలకొరుగుతున్నాయి.

ఈ దురాచారాన్ని అంతమొందించాలనే తలంపుతో ఎందరో సంస్కర్తలు, రచయితలు ఉద్యమాలను నడిపారు. నాటకాలద్వారా ప్రచారం చేసారు. తత్సంబంధీకంగానే శ్రీ కాళ్లకూరి నారాయణరావుగారి "వరవిక్రయం" వెలిసింది. ఇప్పటికీ వేదికలపై ఉపన్యాసాలు సాగుతూనే వున్నాయి. రచనలు వెలువడుతూనే వున్నాయి. సంస్కర్తలు, రాజకీయవేత్తలు సంస్కరించటానికి, శాసనాలు చేయటానికి ముందడుగు వేస్తున్నారు.

కాని ఆ చరణలో ఈవరవిక్రయం, బ్లాక్‌మార్కెట్టు వ్యాపారంలాగా, బాహాటంగా జరుగుతూనేవుంది. ఇందులో విచిత్రమేమిటంటే, ఆడ, మొగపిల్లలను కలిగివున్న దంపతులు - తమ ఆడపిల్లలకు కట్నాలు ఇవ్వడంలో అష్టకష్టాలు అనుభవిస్తూనే, తమ మగబిడ్డల వివాహప్రశంస రావడమే తడవుగా వేలంపాట ప్రారంభిస్తున్నారు. ఇంతకన్నా అవివేకం మరొకటి వుండబోదు.

ఈనాడు ఈ విషవృక్షాన్ని, కూకటి వేళ్లతో పెల్లగించి, సమాజికజీవితాన్ని సంక్షోభంలోంచి, ఆర్థిక దుస్థితినుండి కాపాడడం ఎంతో అవసరం. ఇందుకు ముఖ్యంగా తెలుగు తల్లులే నడుం బిగించాలి.

నిజంచెప్పాలంటే కట్నాలని, కానుకలని, లాంఛనాలని వేధించేది, మనసమాజంలో చదువు, సంధ్యలు, విజ్ఞానం, ముందుచూపు, స్వజాతీయాభిమానం లేని మహిళలే అనాలి.

తమ తోటివనితాలోకం ఈ వరవిక్రయంపేరుతో ఎన్నిఇడుములకు, కడగండ్లకు గురిఅవుతోందో, ఒక్కసారి కనువిప్పి నలువైపులా పరికిస్తే ద్యోతకం కాకపోదు.

ఆ చరణలోలేని రాద్ధాంతాలు, సిద్ధాంతాలు నిష్ప్రయోజనం. తెలుగువనితలు సమాజంలో సమానస్థాయిని సంపాదించాలని ఆత్రత చెందుతూవుంటే, సమాజజీవితాన్ని కుంటుపడజేసే విషబీజాలను కలుపుతీసి, సరయిన పంటచేలకు బలం చేకూర్చాలి.

ఈ వరవిక్రయం అంతమొందించేశక్తి మగవారికిలేదని ఘంటాపథంగా చెబుతున్నాను. దీనినినాశనంచేయాలంటే, తెలుగుతల్లులు పూర్తిగా పూనుకోవాలి. వారే ఈవిష వృక్షాన్ని నశింపచేయగల సమర్థులు.

తమ తోటివనితలను ఉద్ధరించటానికి తెలుగుతల్లులు ముందడుగు వేయలేరా? ఆమాత్రం స్వజాతీయాభిమానం మీలోనుండి బయట వెల్వడదా?

ఈమాత్రం సంస్కరణ తాము తీసుకురావడానికి ముందడుగు వేయలేకపోతే, వనితాలోకం ఏవిధంగానూ సమాజ జీవితాన్ని కాలానుగుణ్యంగా సరిదిద్దడానికి పూనుకోవడం జరగదు.

తెలుగుతల్లులు పూనికతో దీక్షవహిస్తే, తండ్రుల, బిడ్డల మనోవైకల్యాన్ని, సంకుచిత భావాలను అంతమొందించడం చాలాతేలిక. తెలుగుతల్లుల పూనికకు, దురాశాపరులయిన తండ్రులు, వరులుకూడా ఇతోధికంగా తోడ్పడగలిగినపుడు ఈ దురాచారాన్ని అదృశ్యనభావిలోనే సమాజిక జీవితంనుండి సాగనంపవచ్చు.






## చింతపండు పచ్చడి

చింతపండు పచ్చడిని తెలుగువారు కొందరు 'చిన్నమ్మ' అని కందిపప్పు పచ్చడిని 'పెద్దమ్మ' అని వాడుటగలదు. ఏకూరలు దొరకనప్పుడు యీ రెండు పచ్చళ్లను చేసికొని అన్నమును భుజించెదరు. ఈపచ్చడిని చేయువిధమును నాకు తెలిసినది వ్రాయుచున్నాను.

కావలసిన చింతపండును తీసికొని, అందుండు యీనెలను విత్తులను తీసివైచి మెత్తగానూరి పెట్టుకొనవలయును. అటుపిమ్మట పొయ్యిమీద బాణలిపెట్టి నువ్వులనూనెను పోసి, కాగినపిమ్మట ఇంగువపలుకులను నూనెలోవేసి వేలినపిమ్మట కావలసిన యెండుమిరపకాయలను నూనెలోవేసి, మిరపకాయలు ఎర్రరంగుగా మారువరకు వేయించవలయును. పిమ్మట కొద్దిగా మెంతులను, మెంతులకు మూడుభాగములు జీలకర్రను బాణలిలో వేసి చిటపట వేగినపిమ్మట బాణలిని క్రిందికిదించి పెట్టవలయును. వేగిన మిరపకాయలవేడి ఆరకముందే బండమీదవేసి కావలసిన ఉప్పునువేసి నూరినపిమ్మట, చింతపండునువేసి, కలియనూరవలెను. కడపట వేగినమెంతులను జీలకర్రను, ఇంగువనువేసినూరి, తీసికొన వలయును. కొందరు కొద్దిగబెల్లమునుకూడ చేర్చినూరుకొనెదరు.

## మినుముల చింతపండు పచ్చడి.

మినుముల చింతపండు పచ్చడికూడ ఆంధ్రులకు ప్రియమైనదే. ఈ పచ్చడిని మినపపప్పుతో చేయుట కంటె, ముడిమినుములతో తయారుచేసిననే దానిరుచి తెలియగలదు.

ప్రయాణములకు యాత్రకు బోవువారు యీ సంబారు చింతపండు పచ్చడిని అన్నంలోపొడిని యేమారరు. దీనిని నీళ్లులేకనూరిన ఒక మాసము వరకుకూడ నిలువయుండును. దీనిని మెత్తగ నూరకూడదు. "వక్కా ముక్కగ నూరిననే దానిరుచి" అని ఆంధ్రులనెదరు. మినపగింజ పంటికి తగులుచుండ వలయును. దీనిని యీ క్రిందివిధముగ తయారుచేయనగును.

చింతపండును తీసికొని దానిలో యీనెలు, తొక్కలు, విత్తులు వేరుపరచి, కావలసిన ఉప్పునువేసి మెత్తగా రోటిలోదంచవలయును. ఆ దంచినముద్దను వేరుగా పెట్టుకొనవలయును.

పిమ్మట పొయ్యిమీద బాణలినిపెట్టి నువ్వులనూనెను బాణలిలోపోసి యింగువముక్కలనుకాల్చి తీసి పెట్టుకొనవలయును. పిమ్మట ఆకాగిన నూనెలోనే బాగుచేసిన ముడిమినుములను కావలసిన మట్టుకువేసి కమ్మని వాసనరాగానే, యెండుమిరపకాయలను బాణలిలోవేసి వేయించి క్రిందపెట్టవలయును, మొదట వేయించిన మినుములను వక్కాముక్కగదంచి, పిమ్మట మిరపకాయలు, ఉప్పు, యింగువనుకలిపి దంచ వలయును.

పిమ్మట చింతపండును దానిలోవేసి ముద్దగునట్లు దంచి వాడుకొనవలయును. దీనిలోకూడ కొద్దిగ బెల్లమునువేసి నూరవచ్చును.

# బ్రతుకు తెరువు



'గృహలక్ష్మి'యందు ఇన్నాళ్లుగా ప్రచురమయ్యే బ్రతుకు తెరువు విషయములు ముఖ్యముగా స్త్రీలకొరకేయని పాఠకులిప్పటికే గ్రహించియుందురు. ఇంతవరకు కొన్నివిధములయిన పరిశ్రమలనుగూర్చియే ఇంకు వ్రాసియున్నాము. ఇప్పుడు మరికొన్నిరకములగు చేతిపనులనుగురించి వ్రాయబడును. మాపత్రికా పాఠకులు కేవలము దీనిని నాటికి చదివి మరునాటికి మరచిపోందని మా అభిప్రాయము కాదు. తమతమ ప్రాంతములలో ఆ యా వానిని తయారుచేసి విక్రయించిన ఉపజీవనముగా నేర్పకుటకు వీలుండునేమోనని మా అభిలాష. కావున మాపాఠకులీవిషయమును యోచించి యత్నించిచూచి తత్ఫలితములను వ్రాయించగోరుదము. మేము వ్రాసినవియేకాక ఆయాప్రాంతములకు అనుకూలములైనవి, అవకాశములు గలవియైన మరి ఏయితర పరిశ్రమలగూర్చియైనను అనుభవపూర్వకముగ బ్రతుకు తెరువైనవానిని మా పత్రికకువ్రాసి తమ సోదరీమణులకు తోడ్పడుదురుగాక యని మేము మాపాఠకులను గోరుచున్నాము.

## దోసపప్పు వలుచుట

మద్రాసులో గొప్పయింటిస్త్రీలు, ముఖ్యముగ వైశ్యులు, వారి తీరుబడి సమయములలో సిద్ధవటము దోసకాయలలోని గింజలను ఎండబెట్టి, వడిలోపోసుకొని, మాట్లాడుచును, పోట్లాడుచును కూడ, ఆ దోసవిత్తులపప్పును వలిచి చేర్చిపెట్టి పళ్లకొలదిగా విక్రయింతురు. ఈ దోసగింజలు దోసపండ్లు విక్రయించువారివద్ద దొరుకును. దోసపండ్లు చిల్లరగా అమ్మువారు కొందరు పేదవారికొరకై బద్దలుగాతరిగి అమ్ముటను మనము చూచుచుందుము. వారాపండ్ల విత్తనములను జాగ్రత్తచేసిపెట్టి ఇట్లు విక్రయింతురు. అట్టివారివద్ద కొనితెచ్చిన విత్తనములకు బూడిదెను పట్టించి ఎండలోపెట్టి పిమ్మట పప్పును గోటితో చిటుకు చిటుకుమని చిత్రముగ వలిచెదరు. ఈ పప్పును పడి 1-కి రు. 3-0-0 మొదలు 4-0-0 లు వరకు విక్రయించెదరు. ఈ పప్పును సువాసనవక్కపొడిని అమ్మేవారుకొని అందులో కలుపుదురు. మరియు ఆయుర్వేద వైద్యులు, యూనాని వైద్యులు కూడ వారుచేయు లేహ్యములలో ఈ పప్పును చేర్చెదరు. ఈ కాలమున వాసనవక్కపొడి వాడుకయు వ్యాపారమును అధికమైనందున ఈ దోసవిత్తుల పప్పునకుకూడా అమ్మకము అధికమైనది.

## పప్పులను చేయుట

వైశ్యస్త్రీలు ఇంటిపట్టులనుండి పురుషులకు ఎట్లు తోడ్పడునది మరియొకదానిని తెలిపెదను. మద్రాసు జార్జిటౌనులో కొత్వాల్ సావడికి సమీపమున ఆచారప్పవీధి అను పేరుతో యొక బజారున్నది. దానిని పప్పులవీధి అనికూడ చెప్పెదరు. ఆ వీధిలో చాలా యిండ్లు కోమట్లవే. శెట్లుపరాయి గ్రామాదులకుపోయి కాయధాన్యములను కొనుగోలుచేసి మద్రాసునకు పంపుదురు. ఇంటిలోని శెట్టెమ్మలు (వారిఇండ్లలోనుండు ఆడువారు) కూలి వాండ్రనుపెట్టి పప్పులుచేయించి విక్రయించుచుందురు. కందిపప్పును, వాటినూకను, నూకతోకలిసినపొట్టును, పొట్టునునాలుగువిధములుగ గోతాలలోనింపి యింటిలోఉంచెదరు.

పప్పులను అమ్ము చమత్కారమునుగూర్చి ఒక పంతులుగారు తమ అనుభవము నిట్లు వివరించిరి. పప్పును కావలసి వచ్చినవానిని ఆమెచూచి మొదటి గుమ్మంలోనే ఎదు ర్కొని, ఏమండీ పప్పులకు పంతులుగారే స్వయంగా వచ్చినారే - అని చల్లని మాటలతో లోపలికి తీసికొనిపోయెను. అక్కడ ఒకగోతాములోని పప్పుచూపించుచు, "ఈ పప్పు అసలు తిరుప్పూరు కందిపప్పు; పాలూరి వారింటిపెండ్లికి స్పెషల్ గా తయారుచేసి ఉంచి నాము. తమకు కావలసియుంటే మంచివి లోపలయున్నవి. బాగాఉడుకును; ఇచ్చెదను" అని చెప్పెను. దానికి ఆవచ్చిన పంతులుగారు "నాకు ఎక్కువ అక్కరలేదుగాని ఆపెండ్లికి తయారుచేసిన తిరుపూరిపప్పునే 5 పళ్లుమాత్రము ఇచ్చినచాలును" అనిరి. అప్పు డామె విసుక్కుంటూ యిచ్చి, మీరింకెవరితోకూడ ఈలాటిపప్పు యిక్కడ ఉన్నట్లు చెప్పవద్దు - అనెను. వెంటనే పంతులుగారు 10 రూపాయల నోటునుతీసి శెట్టెమ్మవద్ద ఇచ్చెను. శెట్టెమ్మ ఆనోటును వెంటనే గల్లాపెట్టెలో పడవైచి, - పంతులుగారితో ఈవిధ ముగా ప్రసంగింప నారంభించెను: "అదిసరేగాని పంతులుగారూ! అమ్మాయిపెండ్లి ఎప్పుడు చేస్తారండీ? పెండ్లికి పప్పులు మావద్దనే తీసుకోవాలె; మరచిపోరుగదా? అబ్బాయివడుగు కూడా అమ్మాయి పెండ్లితోగూడానే చేయండి. ఖర్చుతగ్గుతుంది" అని మంచిమాట చెప్పుచూ, దండముపెట్టెను. వెంటనే పంతులుగారు పప్పులమూట నెత్తుకొని ఇంటికివచ్చిరి.

ఇంటికి రాగానేయిల్లాలు ఏమేమి తెచ్చారండీ అని మూటవిప్పిచూచెను. అప్పుడు పంతులు తికమకలాడుచు క్రిందపైనచూచి - కందిపప్పువెలను మొదటనేనామెనడుగలేదు. పప్పువెల ఎంతతీసుకొన్నదో తెలియదు. తిరుగ ఆమె యెంత నాకుయిచ్చినది జ్ఞాపకము లేదు - అంటూ వెంటనే శెట్టిఅమ్మవద్దకు పంతులుగారు పరుగెత్తిరి. అప్పుడు అక్కడ

బేరగాండ్లు ఎవరున్నూ లేనందున శెట్టెమ్మ విస్తళ్లు కుట్టుకొనుచుండెను. ఆమెవిస్తళ్లు కుట్టుచున్నప్పుడు పీనపుల్లలను గుచ్చి విరుచుటలో ఆమెచేతిని తొడుగుకొన్న రవలగాజులు కదలికచే గలగలలాడుచు - మిలమిల మెరయుచుండెను. ఆ తళుకునుచూచినప్పుడు పంతులుగారికనులు భ్రమసెను. అయినను ధైర్యముతెచ్చుకొని పంతులుగారు అసలుసంగతిని అడిగిరి. దానికామె - "పంతులుగారు! మీరు నాకిచ్చిన పదిరూపాయల నోటును గల్లా పెట్టెలోపెట్టి మిగత 5 రూ॥ల నోటును అప్పుడే మీచేతిలో పెట్టితినిగదా. దానిని మీరు నడుమునకు గట్టిన గుడ్డలో దోపితిరి. దారిలోపోవుచు గుడ్డ సవరించుకొనునప్పుడు జారవిడిచితిరో?" - అనెను. అంత పంతులు భార్యకు సర్వమునివేదించుకొనెను. ఈవాళ ఆదివారమైనందున మిమ్ములనే అంగడికి పంపినానుగాని లేకుండిన నేనేపోయిఉందును- ఇకమీదట మీరుఅంగడికి పోవద్దు అని మగనితో ఖండితముగా ఆమె చెప్పెను.

సాధారణముగా ఆడవాండ్రు ఆడవాండ్రనుచూచి భ్రమపడక కొసిరి,కొసిరి, కొద్ది లాభముతో సామానులుకొని యింటికి తెచ్చెదరు; కాని పురుషులవలె భ్రమసి నష్టపడి యింటికిరారు. ఇందువల్లనే మద్రాసులో పెద్దషాపులలో చిన్నపడుచులను (Sales women) సామానులను విక్రయించుటకుగాను నియమించెదరు. వైశ్యస్త్రీలు మద్రాసులో కోకలను నగలను వెండిసామానులను యిండ్లకు తీసుకొనివచ్చి విక్రయింతురు.

ఈకథనంతయు వ్రాయుట సామాన్యముగ జరుగు సంగతులు చెప్పుటకేగాని- ఇట్టి మోసకృత్యములును బ్రతుకు తెరువుఅని చెప్పుటకు కాదు. అయితే పప్పులుచేసి అమ్ముటమాత్రము మంచి బ్రతుకు తెరువే?

## ఊదువత్తిపుల్లల చీల్చుట

బెంగళూరులో ఊదువత్తుల (సాంబ్రాణి కడ్డీలు) వ్యాపారము మెండు. ఈఊదువత్తులను తయారుచేసి విక్రయించువారు వెదురుబద్దలనుతెచ్చి గోషా స్త్రీలవద్దయిచ్చి పోయెదరు. వారు వాటిని ఒకటి రెండురోజులలో సన్నగ కొలతప్రకారము చీల్చిపెట్టెదరు. బద్దలను ఇచ్చిన వర్తకుడు తిరిగివచ్చి చీల్చినవాటిని తూచుకొని కూలియిచ్చి పుల్లలను తీసికొనిపోయి వాటికి మందునుపూసి విక్రయించును. ఈగోషా స్త్రీలు ఇంటిలోకూర్చొని ఈ విధముగా రోజు 1-కి 0-8 0 లకు తక్కువలేకుండా సంపాదించెదరు. ఇదియొక బ్రతుకు తెరువు మార్గము.

## అప్పడాలు, వడియాలు, తయారుచేయుట

మద్రాసులో అరవ అమ్మలక్కలు కొందరు పురుషులను ఉద్యోగములకును, పిల్లవాండ్రను బడికిని పంపినపిమ్మట అనేకరకములయిన అప్పడములను, పప్పడములను, వడియములను, వుప్పువరుగులను, పొడులను, పచ్చడులను తయారుచేసి పురుషులు పిల్లకాయలు ఇంటికి వచ్చినపిమ్మట ఈ వస్తువులను సంచులలోవేసి వారివద్దఇచ్చి, యింటింటికిపోయి విక్రయించమని చెప్పి పంపెదరు. ఈ వ్యాపారము బీదవారికి మంచి ఉపజీవనముగా ఉంటున్నది.

## ఊరగాయలు పచ్చళ్లు పెట్టుట

మరియు ఊరగాయలు, శామియా, సాంబారుచారు పొళ్ళు మొదలగునవి అమ్ము అంగళ్లుకూడ నున్నవి. ఇట్టిఅంగళ్లు తిరువల్లిక్కేణిలోనే అధికముగ నున్నవి. కొందరుస్త్రీలు ఇండ్లలోనే తయారుచేసి ఆ వస్తువులను మొత్తముగా నీఅంగళ్లవారికి అమ్మెదరు. అంగడి వారు చిల్లరగాఅమ్మి లాభమును పొందుచున్నారు.

## అటుకులు అమ్ముట

కొందరు వైష్ణవస్త్రీలు తిరుమణిని దిట్టముగ ధరించుకొని, పట్టుపంచను మడిగట్టుకొని, ఒకబుట్టలో అటుకులనుపోసుకొని, ఆబుట్టకుకూడ పట్టుగుడ్డకట్టి ఆచారముగల బ్రాహ్మణులఇండ్లకుపోయి "మడిఅటుకులు" అని అమ్మి పొట్టపోసునేవారున్నూ కలరు. నిజమునకు, వీరు ఇట్లా అమ్మేఅటుకులు చాలావరకు కొత్వాలుబజారులో శూద్రులు తయారుచేసి అమ్మినవే.

ఈ ఊరిలో ఈ విధముగా ఎన్నోరకములుగ అరవవారు జీవించుచున్నారు. కాని మన తెలుగువారొకరైనను ఇట్టి వ్యాపారమున కానరారు. ఇప్పుడిప్పుడు తెలుగువారు సినిమాలలో ప్రవేశించుచున్నారుగాని ఆకొలువు సంవత్సరమంతయు అన్నముపెట్టుట లేదు. మద్రాసులో తెలుగువారు సగముమందియై యున్నారు. ఆంధ్రులకు ఆపూటకు అన్నమున్నదానినే రెండుపూటలు భుజించి, బాతాఖానీతో కాలక్షేపము చేయుదురేగాని కష్టపడి పనిచేసి సుఖముగజీవించు సర్దాలేదు.

గృహలక్ష్ములు ఇంకా ఏయేవిధముగా ఉపజీవనమును చేయగలరనే విషయములు మరికొన్ని వచ్చేమాసపు 'గృహలక్ష్మి'లో వ్రాయబడును.

# ఇంటిపనులలో మెళకువలు

## శిశుపోషణ

కవిచంద్రులు, కోట సోదరకవులు, అష్టావధానులు.

ధన్వంతరి శిష్యులలో సుశ్రుతుడు అగ్రగణ్యుడు. ఈతడు తన సంహితలో పాలగుణము విశేషించి చెప్పియున్నాడు.

తల్లిపాలు:—బిడ్డలు పుట్టింది మొదలు పాలు మఱచేంతవరకు తల్లిపాలు శ్రేష్ఠము. తల్లి భుజించిన ఆహారధృతి పాలుగా మారును. తల్లి ఏతత్త్వము కలదియో, బిడ్డకూడ అదేతత్త్వము కలదిగా నగును. సాధారణంగా తల్లిపాలు త్రాగినబిడ్డ మాతపై మిగుల ప్రేమకలదిగా నగును. తల్లి బిడ్డఁడు గొప్పవాఁడు గావలయుననియే ఆశించును. బిడ్డబలంగా, దృఢంగా ఉన్నదంటే అది "చనుబాల" మహిమ అంటాము. కానబిడ్డకు తల్లిపాలు బలకరము, ఆరోగ్యకరము, మేధావంతము కలిగించు ననుట అనుభూత విషయమే. బిడ్డ తల్లిశరీర మాంసభాగమే కనుక శిశుపోషణకు వలయు అన్నిధాతువులు స్తన్యము వలననే లభించుచున్నవి.

విత్తనము మొలకెత్తిన తర్వాత వేరుభూమిలోనికిబోయి స్వంతంగా ఆహారము సంపాదించు కొనగలిగేంతవఱకు, పప్పుబద్దలేకదా ఆమొలకకు ఆహారము సంపాదించి యిచ్చునవి. అట్లేబిడ్డ స్వయంగా ఆహారము తిని జీర్ణించుకొనేవరకు స్తన్యమే బలవత్తర మగు నాహారము.

తల్లికి మారుగా కొందఱు దాది (ఇతరస్త్రీ) పాలు బిడ్డకు ఇప్పింతురు. దాది బిడ్డకు వ్యతిరేకమైన తత్త్వము కలదిగా నుండవచ్చు. అంటురోగములు కలదిగా నుండవచ్చు. అనారోగ్యముగా, భిన్నాకారిగా నుండవచ్చు. అందుచేత దాదిపొత్తిళ్లలో బిడ్డడు చేరగనే గుర్తించి, బాపురు మనుసేగాని గుక్కెఁడు పాలుత్రాగడు. ఇంకకొందఱు గిన్నెలోనికి పిండించి పోయుదురు. ఇట్లుచేయుటయు దోషమే. గాలిలోమనకంటికి గనబడని సూక్ష్మాదిసూక్ష్మములైన రోగక్రిములున్నవి. పిండించినపాలలో అవిప్రవేసించి, బిడ్డకు జాడ్య మ్మాపాదింపఁజేయును. లేదా పాలకు దృష్టిదోషము గలుగవచ్చును. ఇదియుగాక మఱొక విశేషం కలదు. బిడ్డరొమ్మును నోటిలోఁబెట్టుకొని స్తన్యముత్రాగునపుడు ధారలు

ఉష్ణముగా వచ్చును. ఇవి "ఉష్ణధార" లనఁబడును. ఇఁక వేడి చేయనక్కరలేక సులభముగా బిడ్డకు జీర్ణమగును. పైరెండు దోషములు ఆపాదింపనేరవు. రోగులు, బలహీనులు ఆవుపాలు గూడ "ఉష్ణధారలు" ఉపయోగింతురు. పిండినవెంటనే నురుగుతో వేడిగా నుండుపాలు ఉష్ణధారలు.

ఆవుపాలు:—తల్లిపాలు తరువాత బిడ్డకు ఆవుపాలు శ్రేష్ఠము. ఆవును గోమాత అందురు. తల్లిని గౌరవించినట్లు, పూజించినట్లు, ప్రేమించినట్లు ఆవును జూచుట హిందువుల ఆచారము, విధి. ఆవుపాలతో సమానముగు నీరు కలిపి, చక్కగా కాచి, చల్లార్చి పరిమాణమునుబట్టి బిడ్డలకు పోయవలయును. కాచుటచే సూక్ష్మక్రిముల దోషము హరించును. బహిరంగముగా పాలుపితుకుటచే దృష్టిదోషము తొలగును. కాని గోవు, బలముగా నుండవలెను. ఆరోగ్యముగా నుండవలెను. పెంటమున్నగు తినరానివి తినకుండునట్లు చూడవలెను. ఇట్టి ఆవుపాలు బిడ్డలకు హితమైనవి. ఆవుపాలు బిడ్డలకేగాక ఎల్లరకు బలవర్ధనము. మేధావంతము. ఆరోగ్యము. ఇకబిడ్డల విషయము వేఱుగా జెప్పవలయునా?

మేఁకపాలు:—ఆవుపాలు తరువాత మేకపాలు బిడ్డలకు తగినవి. ఆవువలె ఈజంతువు పవిత్రమైనది. ఇందువిశేషము గూడ కలదు. మేఁకపాలు ముండ్లచెట్ల ఆకులను, తీగెలను ముఖ్యంగా తినును. తుమ్మ ఆకు (నల్ల తెల్ల) దానికి మిగుల ప్రీతి. రకరకములైన ఆకులను దిని పితుకు మేఁకపాలు ఆహారముగా నుపయోగపడుటయేగాక, ఔషధముగా గూడ పనిచేయుననుట నిస్సంశయము. తుమ్మ ఆకులో ఎముకల పుష్టికరమగు విటమినుకలదు, తుమ్మచిగురు నలిచి, చనుబాలతో రంగరించి నేత్రరోగములకు మందుగా నుపయోగింతురు. తుమ్మఆకు కురుపులకు, వ్రణములకు నుపయోగకారి. చెట్టుబెరడు పుండ్లు కడుగుటకు "లోషన్"గా నుపయోగింతురు. అట్టితుమ్మ ఆకు ముఖ్యాహారముగా గలిగిన మేకపాలలో గుణములు మహత్తరములు. అందుచేతనే గాంధీమహాత్ముఁడు మేఁకపాలునే త్రాగుచున్నాడు. మేకపెంట మున్నగు తినరాని వస్తువుల తినదని, నీరుకొద్దిగా త్రాగుననియు, ఆకులలములు తినుననియే మహాత్ముఁడు మేకపాలను సేవించుచున్నాడు. అందుచేతనే గాంధీ మహాత్ముఁడైనాడు. మేకయందు శుచిత్వము, ఆరోగ్యము ముఖ్యములు.

తక్కినవి పోతపాలు. ఇవి కేవలము బిడ్డలకు ఆకలిని బోకార్చి శరీరమును వృద్ధి చేయునవియే కాని గుణవర్ధకములు కావు. అందుచేతనే పోతపాలు త్రాగిన నేటిబిడ్డలు అనేకరోగముల పాలై బలహీనులగుచున్నారు.

కాన భారతీయ గృహలక్ష్ములందఱు పాలగుణములు పరిశీలించి తమబిడ్డలను మహాత్ములుగా గావించుకొని ధన్యులగుదురుగాక. యని మాప్రార్థన.

—(o)—




మనయిండ్లలో వంటచేయునప్పుడు గంజి చేతిమీదపడి బొబ్బలేచుటయు, తెర్లేనీళ్లు కాళ్లమీదపడి కాళ్లుకాలుటయు అప్పుడప్పుడు తటస్థించుచుండును. అప్పుడు వెంటనే ఈ క్రిందవ్రాసిన చికిత్సను చేసినచో బొబ్బ త్వరలో మాని మంటకూడబోవును.

| | | |
|---|---|---|
| నువ్వులనూనె | 1 | భాగము |
| సున్నపుతేట | 1 | ,, |

### నూనె నవనీతం

ఈ రెంటిని కలియబోసి కవ్వంతో చిలికిన వెన్నవలె యగును. దానిని కాలినచోటపట్టించిన త్వరలో మంటలు మానును.

నువ్వులనూనెకు బదులు కొబ్బరినూనెయు వాడవచ్చును.

### శతధౌతఘృతం (మరియొక మందు)

పాతనేతిని 30 తులములను తీసుకొని ఒకగిన్నెలో పోసి కాచవలెను. నెయ్యి కాగుచున్నప్పుడు ఒకతులం తెల్లగుగ్గిలమును పొడిచేసి నేతిలోవేసి కలియబెట్టి పాత్రను క్రిందదించిపెట్టవలయును. ఆవెంటనే రెండుశేర్లు చల్లటినీరును ఆగిన్నెలోపోసి నూరుపర్యాయములకు తక్కువగాకుండ మజ్జిగ చిలికినట్లు చిలికిన వెన్నవలె యగును.

ఈవెన్ననుతీసి ఒక జాడీలోపెట్టుకొని వాడుకొనవలయును. ఇది పాతదగుకొలది దీనిగుణము అధికము. దీనివలన కాలినపుండ్లు విషవ్రణములు, వేసవికాలమున వచ్చు చెమటకాయలు, అరికాళ్లు అరిచేతులు మంటలు, చర్మము బిరుసెక్కుట, ప్లేగుబొబ్బలు మొదలగునవి మానును. తేలుకుట్టినచోట పట్టించి రుద్దిన మంట నివారించును.






# గీతిక

## కుఱ్ఱడన్న కుఱ్ఱడా!

శ్రీ కవికొండల వెంకటరావుగారు



ఆవు అన్న గోవు అన్న అర్థ మొక్కటే;
ఆవు కూడ దూడనడువ ఆవు ఆగును;
ఆవు ఆగి పాలునిచ్చు; 'మ్యాంవు' కివ్వదు:
'మ్యాంవు' ఆవుపాదుగుతాఁక, కుక్క మొఱుగును;
కుక్క మొఱుగువింటు ఆవు కొమ్ము విసరును:
కుక్క 'బొంయి', పిల్లి 'మ్యాంవు', దూడ 'అంభ' నన్
టక్కరి బాలుండు కర్ర టప టప కొట్టున్;
ఎక్కడున్న పాలు త్రాగి ఏపుగాంచెడున్;
చిక్కని మీగడలు మెక్కి, "ఎక్కడివి?" యనున్:
కుక్క "బొంయి', పిల్లి 'మ్యాంవు', దూడ 'అంభ' గా
అన్ని అఱపు లతడె అఱచి, మఱచి మొనఁదాఁ
దన్ను కొట్టుకొనడు! కుఱ్ఱడన్న కుఱ్ఱడా!







# నా చిన్ననాటి ముచ్చటలు

  

కే. ఎన్. కేసరి

గతసంచికలో చెన్నపట్నానికి రాకముందు మా గ్రామంలో ఉండగానే జరిగిన నా చిన్ననాటి ముచ్చట్లను చెప్పియున్నాను. ఇకపై చెన్నపట్నంవచ్చినతర్వాత నేను పెరిగి పెద్దవాడనై, ప్రయోజకుడను కాగలుగుటకుముందు నా అనుభవములో తెలిసిన కొన్ని విశేషములను చెప్పదలచి, అందొక ఘట్టమును ఇందు వ్రాయించుచున్నాను.

సుమారు 60 సం॥ లకు కొంచముపైన చెన్నపట్నంలో ప్రతిడిశంబరునెల ఆఖరు వారమున రాణితోటలో (పీపిల్సుపార్కు) వేడుకలు జరుగుట కారంభమైనవి. వానినే "పార్కుఫేర్ వేడుకలు" అని జనులు పిలుతురు. చెన్నపట్నం మారాష్ట్రమునకు రాజ ధాని కదా. వేసవి శెలవులలో రాష్ట్రోద్యోగులు పలువురు చల్లదనమునకై ఉదకమండల ములకు వెళ్ళుదురు. కావున డిశంబరుశలవులు వేసవి శలవులకన్న క్లుప్తమైనను, పెద్దపెద్ద ఉద్యోగులనుచూచి ఎరుకపడవచ్చుననే ఉద్దేశముతో మండలములనుండి చిన్నఉద్యోగులు పలువురు పనికట్టుకొని చెన్నపట్నమునకు వచ్చుట అలవాటు. బంధువు లిచ్చట యున్నవారు కొందరు కుటుంబములతోనే వచ్చేవారు. ఇట్టి పైజనము వచ్చుటచేత - ఈ వేడుకలకు విస్తారముగా ధనము వచ్చెడిది. మరియు అనేకవిధములగు వస్తువుల ప్రదర్శనమును, విక్రయమును జరిగెడిది.

ఇప్పుడు పార్కులో బ్యాండు వాయించుస్థలమున నీవేడుకలు జరిగెడివి. అచ్చట ఈ ప్రదర్శనములకై ఏటేటా టెంకాయఆకులతో వెదురుబొంగులతో పెద్దపెద్ద రెండు ఆవరణములను కట్టేవారు. మొదటిది లోపలి అవరణము (Inner circle). రెండవది వెలుపలి ఆవరణము (Outer circle). మొదటి ఆవరణములో వెలగలవస్తువులను ప్రదర్శించే వారు. రెండవ ఆవరణములో సోడాఅంగళ్లు, లాటరీ అంగళ్లు, కాఫీ హోటళ్లు మొదలగు వాటిని ప్రదర్శింపజేయువారు. దుండగీడులు మొదటి ఆవరణపు తడికలపైనెక్కి లోనికి దూకకుండ దానిని చౌకకొయ్యలతో దిట్టముగా కట్టేవారు. ఒక్కొక్క ఆవరణమునకు నాలుగుద్వారము లుండేవి. ద్వారములవద్ద పోలీసుకాపాదారితోపాటు అంగళ్ల కంట్రాక్టరుల

తాలూకు మనుష్యులుకూడా ఉండేవారు. వెలుపలి ఆవరణము లోనికిపోవుటకు అర్ధణా టిక్కట్టు; లోపలి ఆవరణమునకుపోవుటకు నాలుగణాలు యివ్వవలయును. మొదటఅర్ధణా యిచ్చి, లోపలికి పోతేగాని నాలుగణాల ఆవరణమునకు పోవుటకు వీలుకాదు.

అప్పటికి యింకను మద్రాసులో ఎలక్ట్రిక్ దీపాలు ఏర్పడలేదు. రాత్రి వెలుతురు కొరకు కిర్సనాయిల్ పోసిన తగరపుబుడ్లను, అంగళ్లలోను, బయటను తోరణములుగా కట్టేవారు. ఆనూనెదీపములను వెలిగించుటకు 5 గం॥ లకే ప్రారంభించినగాని, చీకటిపడు నప్పటికి ముగియదు.

ఆ కాలమున నేను మద్రాసులోనేయుండి చదువుకొను చుంటిని. నాతల్లి నన్ను చూచిపోవుటకు మద్రాసువచ్చినది. ఆమె వచ్చినపిమ్మట కొత్వాలుబజారు సమీపమున యుండు ఆచారప్పణ్వీధి సందులోయున్న, ఒక యింటిలో ఒక రూమును నెల 1 కి రు. 0-12-0 లకు అద్దెకు తీసుకొని ఇరువురము నివసించుచుంటిమి.

అది 1886 అని జ్ఞాపకము. అప్పటికి రాణితోటలో డిశంబరు వేడుకలు ప్రారంభమై రెండు మూడు సం॥ లైనది. ఆ సం॥ ను యథాప్రకార మవి సాగుచున్నవి. ఒకనాటి సాయంకాలము మాయింటిలో కాపురముండే పిల్లవాడును నేనునుకలిసి రాణితోటలోని వేడుకలుచూడ వెళ్లితిమి. నేను మాతల్లితో చెప్పియే వెళ్లితిని. మేమిరువురు సంతోషముతో ఇల్లువిడిచి నడుస్తూ సాయంకాలం 6 గంటలకు తోటకుచేరితిమి. పిమ్మట కొంతసేపు బయటనున్న రంకులరాట్నమును ఎక్కి గిరగిర తిరిగి ఆనందించితిమి. చుక్కాణిలో కాశీ రామేశ్వరములనుచూచి సంతోషించితిమి. ఆవల నాతోవచ్చిన పిల్లవాడు లోనికిపోదాము అనినన్నుకూడ పిలిచినాడు. నావద్ద అర్ధణాలేదని చెప్పితిని. అయితే నాతోవచ్చిన బాలుని వద్ద అర్ధణామాత్రమే యుండెను. ఆతడు నాయందలి సావాసమున నన్ను విడిచిపోలేక పోలేక లోపలికిపోయెను. అప్పుడు నాచేతిలో అరుదమ్మిడీలు లేనికారణమున నేను దిగబడి ఉండ వలసి వచ్చెను. అర్ధణామాత్రమే చేతిలోఉన్న ధనవంతునిబిడ్డ మాత్రము లోపలికి వెళ్ల గలిగినాడు. నేను వెలుపలనే తిరుగుచుంటిని.

పిమ్మట కొంతసేపటికి లోపలి ఆవరణమునుండి పొగలెగయ నారంభించెను. మంటలుమండి వ్యాపించుచుండెను. ఆమంటతోకూడ వెదురుబొంగులు పెటీల్, పెటీల్, మని

కాలి పగులుచున్న శబ్దము లోపలినుండి వినబడెను. లోపలికి పోయినజనము బయటికి వచ్చుటకు ప్రయత్నించు చుండిరిగాని, పొగమంటవల్ల కండ్లుగానక దారితప్పి ఒకరిమీద ఒకరు పడుటయు, కాళ్లక్రింద స్త్రీలు బిడ్డలుపడి చితికిపోవుటయు తటస్థించెను. ఆనాటి ప్రదర్శనమునకు గొప్పయింటివారు చాలమంది వచ్చియుండిరి. వచ్చిన పురుషులు వారి ఆలుబిడ్డలను వెతుకుచు ఒకరినొకరు గుర్తించలేక అగ్నిదేవున కందరు సర్పణమైరి.

అంతటి ఆనందమయమైన ప్రదేశమంతయు నొక్క అరగంటలోపల రుద్రభూమియై పోయినది. లోపలినుండి తప్పించుకొని రాగలిగినవారిలో కొందరికి గాయములు, కాల్పులు, గ్రుడ్డితనము, ఏర్పడగా ఎట్లో వారు బయట పడిరి. కొందరు మంటలకు తాళజాలక సమీపములో నున్న కూవంనదిలో దూకిరి. వెలగల నగలు, ఇతర విలువైన పదార్థములు ప్రదర్శించినవారు సొమ్మును విడిచి రాలేక అంగళ్లలోనే కాలిపోయిరి. అట్టిసమయమున చోరీలుకూడా మెండుగా జరిగినవి. మరణించిన బిడ్డలమీదను స్త్రీల మీదను యుండే, వెండిబంగారపు నగలు, వస్త్రములందలి సరిగెలు కరిగి బంగారము, వెండిముద్దలు గట్టిపోయినవి. ఆరోజుల పురుషులును తగుమాత్రము నగలు ధరించేవారు. ఆనాడు అమావాశ్యనాటి నీలి ఆకాశమువలె రుద్రభూమియై యున్న ఆవినోద ప్రదేశమున - ఆ వెండి బంగారపు ముద్దలు నక్షత్రములవలె మిసమిస లాడుచు వెలుగ సాగినవి.

ఇంతలో పోలీసు వారువచ్చి నిప్పునార్పు ఇంజన్లతో కాలిన కొరవులను, ఆర్పివైచిరి. ఆరోజులలో చెన్నపట్నంలో చాలినన్ని నిప్పునార్పు యంత్రములు (ఫైర్ ఇంజన్లు) లేవు కావున తెల్లవార్లు ఆమంటల నార్పవలసి వచ్చినది.

ఆరోజున నొకమహనీయుడొనర్చినసేవ వర్ణనాతీతము. ఆయన క్రిస్టియన్ కాలేజీప్రిన్సిపాల్ మిల్లరుదొర. ఆయన నేటివారి వంటివారు కారు; పూర్వపు కణ్వ, గౌతమ కాణాదాది కులపతుల తలపించు కరుణార్ద్రహృదయుడు. ఆయన స్వయముగా, సాహసించి గుంజలెగప్రాకి కాలుచున్న పందిళ్లను దులిపి వేసినారు. పొగలోనున్న, శిశువులను స్త్రీలను ఇవతలికి తెచ్చివిడిచినారు. ఇంకెన్నివిధములుగానో అచ్చట బాధితులకు సహాయపడినారు. అంతేకాక కాలేజీకివెళ్లి రిజిస్టరుచేతబుచ్చుకొని పొరుగూళ్లనుండి విద్యాభ్యాసమునకైవచ్చి, కొనకొక్కడు, గొందికొక్కడుగా నుండిన వారిని పేరుపేరు వరుసన

తెలుసుకొని వారి యోగక్షేమములను విచారించి వారితలిదండ్రులకు పోషకులకు తెలియ పరచి వారి ఆర్తిను బాపిన శిష్యవత్సలుడగు మహాత్ముడతడు.

ఆ రుద్రభూమి నంతయు పోలీసులెంత కాపలా కాచినను, తెల్లవారే సరికి కరిగి ముద్దలైన వెండి, బంగారములు, వెదజల్లబడిన నవరత్నములు చాలవరకు ఆనక్షత్రముల వలెనే మటుమాయమై పోయినవి.

ప్రదర్శనమున మంట ఎంతత్వరగా జ్వాలారూపమును దాల్చినదో, అంతత్వరగానే రాణితోట కాలిపోయినదన్నవార్త పట్నమంతా అల్లుకొనినది. మద్రాసులో ఆరోజు విశేష దినమగుటచే చాల యిండ్లలో నుండి వేడుకచూచుచుటకు వెళ్ళియుండిరి. ప్రదర్శనశాల భస్మమైన సంగతిని వినినతోడనే వారివారి బంధువుల క్షేమము తెలుసుకొనుటకు వేలకు వేలుజనము వెర్రిత్తినట్లు ఆక్రోశించుచు ఆ స్థలమునకు పరుగెత్తిరి. నల్లగా కాలి కొఱవిదయ్యములవలె నున్న ఆ శవములను చూచుటకు ఆరాత్రి అధికారులు అవకాశ మివ్వలేదు. అందుచే వారి బంధువులందరును ఆరాత్రి అంతయు అక్కడనే యుండవలసి వచ్చినది. తెల్లవారిన పిమ్మట పోలీసువారు చచ్చిపడియుండిన వారిని గుర్తించుటకు వారిబంధువులకు అనుమతి నిచ్చిరి. అయితే చచ్చిన వారంతా నల్లగబొగ్గు రూపమును దాల్చియుండుట వలన నిజమైన వారిని బంధువులు గుర్తించలేక పోయిరి. సగముకాలి వంటిన నగలున్న వారుకూడా కొందరుండిరి. అట్టివారిని 'మావారు' అని వీరు 'మావారు' అనివారు, తగదాలను పెట్టుకొనిరి. కొందరిని మాత్రంబాగా గుర్తించగలిగిరి, చాలమంది గుర్తించనే లేకపోయిరి. ఆదినము రాత్రియింటికి రాని వారంతా, చచ్చినవారనే తలంచబడి, వారివారి ఇండ్లలో కర్మకాండ జరిపింపబడినది. కొన్నియిండ్లనుండి కొందరు ఇంటిలో చెప్పకుండ అవసరముపనులపై గ్రామములకు వెళ్లినవారునున్నారు. అట్టివారికి కూడా వారి యిండ్లలో కర్మకాండ ముగిసి పోయినది. పిమ్మట ఆ ఊరికి పోయినవారు యింటికి తిరిగిరాగా, ఇంటివారును, వారును ఒకరి నొకరు చూచుకొన్నప్పుడు వారివారిమనస్సు లెట్లుండెననేది పాఠకులే ఊహింప దగును.

ప్రదర్శనములో నుండి చావు తప్పించుకొని ఇవతల పడిన వారును కలరు. అట్టి వారిలో సుప్రసిద్ధ పురుషులగు శ్రీ కొల్లా కన్నయ్య శెట్టిగారొకరు. వీరు మంచి కసరత్తు

చేసిన బలశాలులు. వీరు లోపలినుండి బైటికి తడికల ఆవరణముపైకి ఫల్టీకొట్టి వెలుపలికి దూకిన సాహసికులు, చతురులు. వారట్లు దూకుచుండగా వారిమెడలో నుండిన పెద్ద పొగడాల కంఠమాల జారి క్రిందపడిపోయినది. ఆదండ దొరికిన వాడు మరునాడు శెట్టిగారింటికి వెళ్లి సమర్పించుకొని బహుమానమును పొందినాడు. ఆ కాలమున కొల్లా కన్నయ్య శెట్టిగారిని వారిమెడలో యుండు పొగడాల మాలను తెలియని వారరుదు.

వీరు కోమట్లలో పెద్ద శెట్టి. వైశ్యులందరు వీరిని పూజించనిదే వారిండ్లలో శుభ కార్యములను చేసుకొనే వారు కారు. ధనికుడు; దాత; గంభీర పురుషుడు. వీరు శ్రీ కన్యకా పరమేశ్వరీ దేవాలయపు ధర్మకర్తలు. వారు అప్పుడప్పుడా దేవాలయమునకు వచ్చు చుండేవారు. వారప్పుడు మొగమునిండ విభూతి పూసుకొని దానిపైన యెర్రటి కుంకుమబొట్టు పెట్టుకొని, జోడు గుర్రముల ఫీటన్ బండిలో కూర్చుండ జోడు వింజామరలతో, ఇల్లు బయలుదేరి పరమేశ్వరి దర్శనార్థము దేవాలయమునకు వచ్చునప్పుడు వారికి జరుగుచుండిన గౌరవము, మర్యాద ఇప్పుడీ ప్రాంతమునకు వైస్రాయిగారు వచ్చినావారికిన్నీ జరుగజాలదు. శెట్టిగారు దేవాలయమునకు వచ్చెదరన్న సంగతిని జనులకు తెలుపుట కొరకు దేవాలయములోని పెద్దగంటలను మ్రోగించేవారు. ఈగంట శబ్దమును విన్న వారందరును ఆదర బాదరగా నడుములకు పైపంచల కట్టుకొని, వీధి గుమ్మమున నిలువబడి శెట్టిగారికి రాగానే దాసోహముల సమర్పించేవారు. వీరి ఆస్తి పాస్తుల పరిమితి చెప్పవలయునంటే—ప్రస్తుతము హైకోర్టు దానిచుట్టుప్రక్కల కొన్ని బిల్డింగులుగల ప్రదేశమంతయు నాడు వారిస్వంతము అని చెప్పిన చాలును. అయితే, ఇది వీరి మొదటి మహర్దశ. కడపటిదశను పిదప వ్రాయించెదను.

ఇక నాసంగతి ఏమైనదో చెప్పెదను. నేను ప్రదర్శనమును చూచుటకు లోనికి పోకుండ బయటనుండి ప్రాణముల కాపాడుకొంటిని గాని నాతో కూడవచ్చిన బాలుడు కనబడ కుండుటచే చాలాదూరము వెలుపల గేటువద్ద నిలుచుంటిని గాని వాడుకానరాడాయెను. అప్పుడు నేను వంటరిగా ఇంటివైపునకు తిరిగి పోవుచుంటిని. నేను సెంట్రల్ స్టేషన్ ఎదుటికి వచ్చుసరికి నాపేరుపెట్టి పెద్దగా పిలుచుచూ ఆత్రముతో మాతల్లి

పార్కువైపునకు పరుగెత్తుచుండెను. ఆమె గొంతును నేను గుర్తించితిని. వెంటనే పరుగెత్తిపోయి ఆమెఎదుట నిలువబడితిని. అప్పుడు మాఅమ్మ నన్ను కౌగలించుకొని నిట్టూర్పు విడిచెను. ఆమె ఈపరిదర్శనము కాలిపోయిన వార్త విన్నవెంటనే పరుగెత్తుతూ వచ్చి నన్ను కలుసుకొనుటచే, వళ్లంతయు జోరుచమటలు పోయుచు అలసటచే రొప్పుచుండెను. నేనామె అవస్థను చూచి, రోడ్డువార నామెను కూర్చుండమని చెప్పి నేనున్నూ కూర్చుంటిని. ఆ కూర్చుండినచోటు స్టేషన్‌గేటు ఎదురుగా జనరల్ హాస్పిటల్ ఆవరణపు గోడపక్కన, ఇప్పటికిని నేనాపక్క వెళ్లినప్పుడెల్ల పూర్వస్మృతితో ఆప్రదేశమును గమనించి చూచు చుందును. అక్కడ కొంతవిశ్రాంతి తీసుకొని ఒంటెద్దు బండిమీద యిరుపురము యింటికి చేరితిమి. అప్పుడునాతో కూడవచ్చిన వానితల్లి 'మావాడెక్కడ' యేని అడిగెను. కాని నాకువెంటనే నోట మాటరాక కొంతసేపటికి జరిగినసంగతి నంతయు తిన్నగా చెప్పితిని. వెంటనే ఆమె తనబిడ్డకొరకు పార్కునకు పరుగెత్తినది గాని, రాత్రియంతయు అక్కడ వేచియుండి పిల్లవానిని గుర్తించలేక, తెల్లవారినపిదప నిరాశతో ఆతల్లి యిల్లుచేరినది. చెన్నపట్నమున ఆనాటి దుర్దినం ఆవిధముగా గడిచిపోయినది. ఆనాడు మృతిచెందినవారి శ్రాద్ధములు ఇప్పటికికూడ అనేకులఇండ్లలో, జరుగుచునేయుండవచ్చును.

నాడు చేతిలో అర్ధణా లేక కేసరిగారు
ప్రాణాలు దక్కించుకున్నారు.

పాపం ఆ అర్ధణా ఉన్నఆయన స్నేహితుడు
ప్రాణాలు గోల్పోయినాడు.

—లేఖరి

# బిడ్డను తొలిసారి అత్తగారింటికి పంపునప్పుడు చెప్పెడు బుద్ధులు

శ్రీ పైడిమఱ్ఱి వేంకటసుబ్బారావుగారు.

—;o;—

జపాన్ దేశములో:-

1. నీవు నాకూతురవుగావు, అత్తింటికోడలవు ఇప్పుడు.
2. పెండ్లిఅయినందున నీవొకరిసొత్తువు, నీవాయజమాని ఆజ్ఞలను కనులకద్దుకొని సేవింపుము.
3. నీ అత్తగారిని సంతోషపెట్టుటవలన నీకు శాశ్వతమైన సంతోషము లభింప వీలుగలదు.
4. ఎవరితో విరోధము పెట్టికొనకుము. ఓర్పులేనితనము, కపటము నీలో నుండఁదగవు.
5. ఒకవేళ నీభర్త కోపపడినప్పటికిని నోరు పొడుగుగా పోనీయకుము. అతనికోపమును నీశాంతము వినయవిధేయతలతోను ప్రశంసా వాక్యములతోను నిమ్మళింపుము.
6. ఇంటిపనుల నేర్పుతో జక్కపెట్టుము. తగినట్లు ఏర్పాట్లు చేయుచుండుము. మితముగా ఖర్చు బెట్టుటను మరువవద్దు.
7. జ్యోతిష్కులతోను, మాంత్రికులతోను నీ కష్టములనుగూర్చి సలహా తీసికొనకుము.
8. నిరాడంబరమైనవి. వెలతక్కువవిగానుండు శుభ్రమైన దుస్తులను ధరింపుము.
9. గర్వపడకుము. హెచ్చులుగొట్టకుము. దీనివలనమానవులు గౌరవంగోల్పోయి హాస్యముపొందుదురు.
10. నీతల్లిదండ్రుల పదవులనుజూచియు, వారిధనధాన్య రాజ్యభోగ్యములనుదలంచియు, విఱ్ఱవీఁగకుము. మఱియు నిట్టిమాటలను సగర్వముగా నీభర్తతోగాని, నీఅత్తగారివారగు నెవ్వరితోఁగానివచింపకుము.

అరేబియా దేశములో:-

1. ఓ బిడ్డా! నీవు సర్వదా తృప్తితోనుండుము. నీభర్త ఆజ్ఞలను శిరసావహింపుము.
2. నీభర్తయొక్క కన్నులమీఁదను, ముక్కుమీఁదను నీదృష్టినుంచుము. అతనికన్నులు నీవలని చెడుపనులు చూడకుండా, మంచిశీలముతో నుండుము. అతనినాసిక నీవైపునుండి సుగంధమునే ఆఘ్రాణించునట్లు జాగ్రత్త వహింపుము.
3. భర్త భుజించుసమయమునను నిద్రించుసమయమునను మిక్కిలి ప్రసన్నతతోను, శాంతితోను, మృదువుగానుండుము. ఏలన మిక్కుటమైనఆఁకలి మనుష్యుని భయంకరముగా మార్చివేయఁగలదు, అటులే నిద్రలోనున్నప్పుడు పరిజ్ఞానములేకుండా మేల్కొలిపినప్పుడు, నిద్రను భంగముచేయునట్లు అల్లరిచేసినప్పుడును ప్రళయకారియైన కోపమునకు గుఱి కావలసియుండును.
4. నీభర్తఆజ్ఞ నుల్లంఘింపకుము. అతనిరహస్యముల నొరులకుజెప్పకుము.
5. అతఁడు విచారముగా నున్నప్పుడు సంతోషమును, సంతోషముతో నున్నప్పుడు దుఃఖమును ప్రకటింపకుము.
6. అతని సంతోషమునకు నీసంతోషమునకంటె ప్రాముఖ్యము నొసఁగవలెను. అతని కోరికలను నీకోరికలకంటె ముఖ్యమైనట్టివిగా నిశ్చయించి ఆచరింపుము."

[స్వీయ - "స్త్రీధర్మ" నుండి]



# స్త్రీ మూర్తి

ఓహో.........
స్త్రీ మూర్తి.........
మధుజీవన ధాత్రీ......
... ... ...
సురుచిర కోమల
ప్రవిమల మధుర
గాన లహరి నీ
మృదులగళ ప్రభా
వంపు కెరటమే......
ఆ......హో......
స్త్రీ మూర్తి......
మధుజీవన ధాత్రీ......
... ... ...

అరుణారుణ కిర
ణాల తరగల
మనోహర సుందర
చివురు జొంపముల
సోయగములు నీ
అధర ప్రభావపు
మధుర బింబమే......
ఆ...హా...స్త్రీ మూర్తి
మధుజీవన ధాత్రీ
... ... ...

సత్యం సహనం
నిర్మల ప్రేమ
త్యాగం శీలం
శాంతికి దాంతికి
నీ నవనీత
మృదుల హృదయ కమ
లం బొక్కటియే
ప్రధాన కేంద్రం
ఓహో! స్త్రీ మూర్తి
ఆహా! స్త్రీ మూర్తి
మధుజీవన ధాత్రీ
... ... ...

కె. సభా

## ఉభయ భాషా ప్రవీణ, విద్యా ప్రదాయని

# శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారి

## షష్టిపూర్తి సన్మాన మహోత్సవము.

—(0)—

## ★ కామాక్షి విజయ పరంపరల సూచిక ★

1920 సం. వైశ్య సేవాసదన స్థాపనము.

1929 సం. ఆంధ్రవిశ్వవిద్యాలయము వారి "ఉభయ భాషాప్రవీణ" పట్ట స్వీకరణ

1929 సం. పెద్దాపురం ఆర్య వైశ్య మహాసభవారు వీరికి "సంఘ సేవాధురీణ" అను బిరుదమును పరీక్షావిజయమున కొక సువర్ణపతకమును బహూకరించి యుండిరి.

1931 సం. ఆంధ్రి యువతీ సంస్కృత కళాశాలకు 'ప్రిన్సిపాల్' పదవి నందుట.

1932 సం. మద్రాసులో శ్రీ అల్లాడి కృష్ణస్వామి అయ్యంగారి అధ్యక్షతను, గుంటూరులో శ్రీ వింజమూరి భావనాచార్యులవారి అధ్యక్షతను, జరిగిన బహిరంగసభలో ఆంధ్రియువతీ సంస్కృత కళాశాలాధికారిణిగనున్న వీరికి ప్రత్యేక సన్మానములు, రెండు వేయినూట పదార్లు.

1934 సం. మొదలు మూడు సంవత్సరములు రాజమండ్రి ఆనరరీ బెంచి మేజస్ట్రీటు.

1935 సం. ఆంధ్ర విశ్వవిద్యాలయమున 1938 వఱకు మూఁడు సంవత్సరములు సెనేటు నందును ఎకెడమిక్ కౌన్సిలునందును సభ్యురాలు.

1936 సం. ఈతపోటీ పరీక్షలో రాజమండ్రి మున్సిపాలిటీ వారి బహుమానము (రజత పతకము.)

1936 సం. నుండి 1941 వఱకు రాజమండ్రి పురపాలక సంఘ సభ్యురాలు.

1941 సం. మద్రాసునందు 'గృహలక్ష్మి' పత్రికాధిపతులు శ్రీ కే. ఎన్. కేసరీ గారిచే "విద్యాప్రదాయిని" అనుబిరుద ప్రదానము, స్వర్ణ ఘంటా కంకణ ప్రదానము.

1945 సం. శ్రీ పిఠాపురం మహారాజావారి షష్టిపూర్తి మహోత్సవమున సంస్థా నిర్వాహణమునకుగాను శ్రీ కామాక్షమ్మగారికి రజతపాత్రమును బహూకరించుట.



“శుభయాత్రా ప్రవేశం”

శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారికి

వైశ్య మహాసభ అధ్యక్షులు

శ్రీ ఉప్పుటూరి వెంకటప్పన్నయ్య శ్రేష్ఠిగారు

షష్టిపూర్తి సంచికా సమర్పణముచేయుట

ప్రధాన కార్యదర్శి

శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారు

# శ్రీమతి కామాక్షమ్మగారి సుభాషితాలు



1. "ఎప్పటికైనా నీకాళ్లమీద నీవు నిలవబడడం నేర్చుకో" దీనినే భగవద్గీతలో "ఉద్ధరేదాత్మనాత్మానం" అన్నారు.

2. పట్టుదల వుంటే ఏ పనీ కాకపోదు అందుకే పెద్దలు "కృషితో నాస్తి దుర్భిక్షమ్"అన్నారు.

3. "నీవు సుఖపడి ఒకళ్లను సుఖపెట్టడమే పరమ ధర్మం" "స్వయంతీర్త్వా పరాంస్తారయేత్" అంటే ఇదేకదా!

4. "నీలాగా ఒకరిని చూచుకో అందులో చాలా సుఖం ఉన్నది" "ఆత్మవత్సర్వభూతాని యః పశ్యతి" అనే భగవద్గీతా వాక్యంకూడా ఇదే చెపుతూంది.

5. "అంతరాత్మ మంచిదే అని చెబుతూన్నపుడు ఆ పని చెయ్యటంలో సందేహించకు భగవంతుడనే వాడుంటే ఆపని న్యాయబద్ధమైనపుడు నిన్నూ నీపనినీ ఎందు కాశీర్వదించడు!" గౌతమ బుద్ధుని ఆజీవిత ప్రబోధం ఇదే అని ఇప్పటికి మనం తెలుసుకోగల్గితే సంతోషమే.

6. మనస్సులో ఒకటి తలిచి పైకి ఒకటి చెయ్యకు అంతరాత్మను మోసంచెయ్యకుండా మానసిక సంకల్పాన్ని ఆచరణలో పెట్టడమే పరాయణము, "మనసా కాయేనా వాచా సమానోభవ" అనే ఆచార్యుల వాక్యమే ఇందుకు ప్రమాణం.

7. "ఏదైనా మంచిదని తోచినపుడు వెంటనే చెయ్యి, ఆలస్యం కూడదు" "శుభశ్య శీఘ్రం" అని మన పెద్దలు అందుకే చెప్పారు.

8. "ఒక్కొక్కపుడు ఆలోచనకంటె ఆచరణలో విజయం ఉంటుందని గమనించు" "ధైర్యే సాహసేశ్రీః" అని ఊరికే అన్నారా!

9. "సంతృప్తికిమించిన వస్తువీ ప్రపంచంలో లేదు. సంతుష్టుడీ మూడు జగముల బూజ్యుండు" అని భాగవతం ప్రమాణం పల్కుతుంది.

10. కష్టం అనేది ఈశ్వరప్రసాదం. కష్టం వచ్చినపుడు నిన్ను నీవుకాని, ఒరులనుకాని నిందించకు. కష్టసమయాలలో పట్టుదలతో నిలువబడు. అపుడే విజయానికి అర్హుడవౌతావు" "కష్టే ఫలీ" అనేవాక్యం ఊరికే పుట్టిందా మఱి!

11. కష్ట సుఖాల్లో ఒక్కవిధంగా ఉండగల్గడం ప్రయత్నించైనా నేర్చుకో "యః - సుఖదుఃఖేషు సమస్సంగ వివర్జితః... మేప్రియోనరః" అని కృష్ణపరమాత్మ సెలవిచ్చారు.

12. "పని చెయ్యడమే నీవంతు. ఫలాఫలాలు దేవునిమీద వదులు. ఫల సంగము దుఃఖహేతువు" "కర్మణ్యే వాధికారస్తే మాఫలేషు కదాచన"అని అధికారిక వచనం చెప్పేదికూడా ఈఉత్కృష్టధర్మాన్నే.

13. అపజయమే విజయసాధానికి బాట. ఆ అపజయానికి వెరువక అభివృద్ధి పదంలో ముందుకు సాగిపోవుటే ధీమంతుల లక్షణం. అటువంటివారే ఎప్పటికైనా కార్యసాధకు లౌతారు. "ధరణి నసాధ్యము లేదు సోత్సాహమతుల కెపుడు" అనేవాక్యం దీన్నే ఉద్బోధిస్తూంది.

14. ప్రజాసేవలోనే అన్ని పరమార్థాలూ ఉన్నాయి. తోడి మానవులకు సేవచెయ్యడంలోనే ఈశ్వరుడుకూడా సంతుష్టుడౌతాడు. "కుర్యాద్విద్వాం సథాత్ శక్తశ్చికీర్షుర్లోక సంగ్రహమ్" అనే భగవద్గీతా వాక్యాని కింతకంటే వేరే యర్థమేమి?"




సౌభాగ్యవతి కల్పలతకు.

నెచ్చెలీ !

నీవు వ్రాసినలేఖ చేరినది. మద్రాసు రాష్ట్రనూతనమంత్రివర్గమున స్త్రీలకొక స్థానమీయబడనందులకు విచారించుచు నీవువ్రాసిన వాక్యములు నాకెంతయో నవ్వు గలిగించినవి. స్త్రీలను అవమానించిరనియు, అలక్ష్యముచేసిరనియు, అన్యాయమొనరించిరనియు నీవెంతయో పరితాపమును వెలిబుచ్చినావు. కాని నీయలజడికి కారణము కన్పడదు. నూతనమంత్రివర్గమున నొకయాడుది యుండినంతమాత్రమున మనకు గల్గెడి ప్రయోజనములేదు. లేకున్న నష్టములేదు. స్త్రీలమైనను మనముగూడ ప్రజానీకములోని వారమేగదా. రాష్ట్రప్రజలకు గల్గెడి లాభములు మనకును చేకూరవా? ఇందులకొక స్త్రీ అక్కడ కూర్చుండవలయునా? స్త్రీలకొకస్థాన మీయబడవలయుననునది వారు పాటించవలసిన మర్యాదగాని మనము అర్థించవలసిన కోరిక కాదు. నీవెందులకీ మోజులో నున్నావోగాని నాకు నేటి మంత్రివర్గమేర్పడిన విధానముచూడ నందొక స్త్రీగూడ లేకపోయినందుల కెంతయో సంతోషకరముగానున్నది. మంచి కార్యములలో మగువకు ప్రాతినిధ్యము లేకున్న విచారింపనగును గాని ప్రజలెల్ల రన్యాయ మన్యాయమని ఘోషిల్లిన అకార్యకరణములో పాలులేదని మనమేల చింతించవలయును? గత ఫిబ్రవరి, మార్చిమాసములలో మద్రాసురాష్ట్ర రాజకీయముల గాలిదుమారమెంత అసహ్యకరముగనున్నది? వయోవృద్ధుడును, అనుభవజ్ఞుడును, సమర్థుడును, త్యాగియు, సాహసియు, విశేషించి ప్రజాహితైషియునైన ప్రకాశము పంతులు గారిని ప్రధాని పదవినుండి తొలగించుటకు హైకమాండు మొదలు, సాధారణ అసెంబ్లీ సభ్యునివఱకు చేసిన ప్రయత్నములు, పన్నిన పన్నాగములు, అవలంబించిన పద్ధతులు ఎంతవెగటు పుట్టించినవి. ఈ వ్యూహములు పన్నిన వారందఱు సామాన్యులా! స్వసుఖములు విసర్జించి, ఆస్తిపాస్తుల నష్టమొనర్చుకొని, లాఠీదెబ్బలుతిని, కారాగార క్లేశము ననుభవించి దేశస్వాతంత్ర్యమునకు స్వీయజీవితములు బలిపెట్టుకొనిన మాన్యులుగాని సామాన్యులా! అయిననేమి? ఆనాడు త్యాగములేగాని సుఖానుభవములు లేవాయె. మంచివారు గాకేమి చేయుదురు? మేనకా దర్శనమగువఱకు విశ్వామిత్రుడు బ్రహ్మనిష్ఠుడుగనేయుండెను;

విజితేంద్రియుడుగనే యుండెనుగదా! అవకాశముండియు ఆశావశులు కానివారుగదా నిర్మలులని చెప్పనగును. ఒక పదవి! ఒక అధికారము! ఒక హోదా! ఎదుటనున్నప్పుడు దానిని విర్జించినప్పుడుగదా వారి నిర్వ్యామోహతను గుర్తింపవలయును, నేటి కాంగ్రెసు అసెంబ్లీసభ్యులలో నీ అధికారవ్యామోహము పెచ్చురిల్లినందువల్లనే మద్రాసు రాజకీయము లింత అధ్వాన్న స్థితికి వచ్చినవి.

నిజమునకు ప్రకాశము పంతులుగారు రాష్ట్ర ప్రధాని యగునప్పటికి రాష్ట్రస్థితియెట్లున్నదో మనమెల్లరము కన్నులార గాంచుచున్నదే! మద్రాసు రాష్ట్రమునకు భయంకర క్షామము రానున్నదనియు, బెంగాలు రాష్ట్రమున నడుగు బెట్టనున్న దనియు నెల్లరు భయకంపితు లగుచుండిరి. ఆకలవు దేవత యురిమి చూచుచుండిన భయంకర పరిస్థితిలో ప్రకాశముగారు ప్రధాని పదవి చేకొని మంత్రివర్గమును నిర్మించిరి. మంత్రివర్గమేర్పడగానే ప్రకాశము పంతులుగారే కాదు ఆయన మంత్రివర్గ మంతయు నేకగ్రీవముగా మేము ప్రజాసేవకుల మనియు, ఆకలిమంటచే నొక్కప్రాణియైన చావనీయ మనియు నేకగ్రీవముగా వాక్రుచ్చిరి. ప్రధాని ఆశపథ నిర్వహణమునకు తక్షణమే పూనుకొనెను. ఎచ్చటెచ్చట నున్నతిండి గింజలను రాష్ట్రమునకు దిగుమతి చేయించెను. వానికి బదులుగా వారికి కావలసిన వస్తువుల నిచ్చుటకు పూచీపడెను. దేశము నలుమూలల నుండియేగాదు ప్రపంచము నలుమూలలనుండి ఆహారపదార్థము వెదకి తెప్పించి రాష్ట్రము నింపెను. రైతుల నుపలాలించియు బోనసుల నిచ్చియు రాష్ట్రములోని గింజలను రాబట్టెను. నష్టమును ప్రభుత్వము భరించునట్లు చేసి వారము తప్పకుండ రూపాయికి నాలుగుశేర్లు బియ్యము కొలిపించెను. ప్రపంచములో నెచ్చట ఆహారపదార్థ సంబంధసభ జరిగినను అచ్చటికెల్ల ప్రతినిధుల నురికించెను. గోధుమలో, బియ్యమో, జొన్నలో, నూకలో, ఏదియో తిండిగింజలుగల స్టీమర్లు చెన్నరాష్ట్ర రేవులలో లంగరువేసినన్న సువార్తను పత్రికలలో ప్రకటింపబడని సుదినము లేదు. పదకొండుమాసములు పేదల కడుపులో నిద్రబోయెను.

కాంగ్రెసు వారింత కాలము నుండియు నేయే ప్రణాళికలను నాచరణమునందు బెట్టుదుమని వాక్రుచ్చుచుండిరో ఆఖాదీ పరిశ్రమను, ఆసహకార సంఘములను, ఆదేశీయ పరిశ్రమలను ఉద్ధరించుటకు పూనుకొనెను. అయిననేమి? ఆరేండ్ల యుద్ధపు వేండ్రముతో తుకతుక ఉడికియున్న ప్రజాహృదయము కాంగ్రెసు మంత్రివర్గము నెడ ఆశాభరితమై యుండెను. కావున సహనమును శాంతమును గోల్పోయి దొడ్డి సంభావనపు బ్రాహ్మణులవలె ఆశావశులై యెగబడి గొంతెమ్మకోర్కెల కోరదొడంగిరి. యుద్ధకాలములో గవర్నమెంటు పక్షముననుండి ప్రజాయుద్ధమని ప్రచారము చేసిన కమ్యూనిష్టులు కాంగ్రెసు మంత్రివర్గమునకు వ్యతిరేకులై సమ్మెకట్టుల లేవదీసిరి. సమ్మెకట్టులు కూలినాలి జనము చేయవలసిన పనియైనను, ఆహా! ఆసమ్మెకట్టుల సారస్యమేమి చెప్పవచ్చును? పాకీవాని మొదలుకొని ప్రభుత్వోద్యోగి వఱకు అందఱు సమ్మెలు చేసెదమని బెదరించుచుండే, ఆరేండ్లు యుద్ధకరవుచే బాధపడుచున్నను ఒక్కపైసా జీతమెక్కువ చేయకపోగా యుద్ధపు ఫండుకని ప్రతినెలలోను అసలు జీతములోనే దిగ్గోయుచున్నను నోరుమెదల్పక యూరకొనిన ప్రభుత్వోద్యోగులు కాంగ్రెసు ప్రభుత్వము రాగానే సమ్మెలు కట్టెదమని తీర్మానములు చేయసాగిరి. అయినను ఒకనెల జీతమధిక మిచ్చియు జీతములు వృద్ధి పొందించియు వారిని సంతృప్తి పఱచెను. ఎవరి పండుగలకు వారికి గుడ్డలనిప్పించెను. హరిజనోద్ధరణమును గ్రామపునర్నిర్మాణమునకును

విద్యాభివృద్ధికిని ఆరోగ్యరక్షణకును ఇంకను ప్రజాహిత కార్యము లెన్నిటికో ద్రవ్యమును వెచ్చింప నిశ్చయించెను. ఆమహోదార హృదయములో ఎన్నియో ప్రజాహిత కార్యములు మొగ్గదొడగుచుండెను. కాని అవి పూర్ణవికసితములై పరిమళించక మునుపే కలకలము బయలుదేరినది. ఒకరికష్టమును చూడలేకపోవుట మంచిదేగాని ఒకరిమేలును గూడా కొందరుజూడజాలరు. ఈ అసురలక్షణమే కొందఱు శాసన సభ్యుల హృదయములో ప్రకోపించినది. యంత్రపరిశ్రమల వృద్ధిపొందించరాదనియు, జమీందారీ విధానము రద్దు కావలెననియు ఉత్పత్తికొనుగోలు వ్యాపారాదికములు సహకార సంఘములద్వారా జరిపించి షాహుకార్ల దోపిడి నరికట్టవలెననియు కాంగ్రెసువారు ఎంతకాలము నుండియో పాటపాడుచుండిరి.

ఆ విధానమునే ప్రకాశముపంతులుగారు అవలంబించ నెంచినప్పుడు కాంగ్రెసుసభ్యులందరు తిరిగి ధనికవర్గమునకు మద్దతు అయిరి. పత్రికలును వారికే దోహదమిచ్చెను. ఎంతదూరపు చుట్టమునైనను ధనికుడైనచో మావాడనుట లోకములో నున్నదేగదా. ఇకనేమి షాహుకార్లులు, జమీందారులు, మిల్లుయజమానులు పత్రికాధిపతులు ఏకమైరి. శాసన సభ్యులు వారికితోడ్పడిరి. వీరెల్లరి మాట యట్లుండనిమ్ము. విశాలభారతావని పరిపాలనాభారమెల్ల గుప్పిటబట్టుకొనిన కాంగ్రెసు అగ్రపీఠము వారు గావించిరని చెప్పబడు విశేషములును అత్యంత విచారకరములు. ప్రకాశము పంతులుగారు ఎన్ని విధముల సమర్థుడైనను నూటతొంబదియాఱు కాంగ్రెసు శాసనసభ్యులకు మంత్రిపదవులనీయ నసమర్థుడయ్యెను. అధికారమనినప్పుడు ప్రతివారికిని చేయవలయునను కుతూహలముండుట సహజముగదా! అసెంబ్లీ సభ్యులకేమి ? తదన్యులకే ఆమురిపెములున్నవి. గమనించితివో లేదో. ఈమధ్య ఒక అమ్మాయి మామిత్రురాలో కామెతో ‘యేమండీ అసెంబ్లీ సభ్యులు కానివారు మంత్రిపని చేయరాదండీ’ అని అడిగినదట. ఆ అమ్మాయికి యిరవైయేండ్లుఉండునట కొంచెము ఇంగ్లీషుచదువు కొనినదట, మొన్ననే పెండ్లైనదట. ముక్కుపచ్చలారని అట్టి పసివారికే మంత్రిత్వముచేయు కుతూహలమున్నప్పుడు, కాకలుదీరిన అసెంబ్లీసభ్యులకు పదవీ వ్యామోహము యుండుటలో నాశ్చర్యమేమున్నదని మామిత్రురాలు నవ్వుచు బల్కినది. కాన యీ వ్యామోహ కారణమున ప్రకాశము మంత్రివర్గమునకు ఉపద్రవము సంభవించినది. కంచెయే చేనుమేసినది. కాంగ్రెసుసభ్యులే వ్యతిరేకులైనారు. డిల్లీకి ప్రయాణముకట్టినారు. కాంగ్రెసు అగ్రపీఠమునకు పంతులుగారిపై నేరములు చెప్పిన వారేమి నేరములు చెప్పిరో! వారేమి విచారించిరో పరమాత్మునకెఱుక. తత్క్షణమే ఒకతీర్మానమును జేసి కాంగ్రెసు అధ్యక్షుని జేబులోపెట్టి వివాదపరిష్కారము చేసిరమ్మని పంపించిరి.

ఎవరి స్వార్థము వారిని ప్రేరేపించగా ఓటుచేసిన కాంగ్రెసులెజిస్లేటరు పార్టీసభ్యుల తలలను లెక్కపెట్టుటయు, హైకమాండువారి తీర్పును నాచరణయందు బెట్టుటయు, నివియే అధ్యక్షునగల అధికారములు. ఇంతకు మించి వ్యవహరించుట కాయన స్వతంత్రుడు కాడు. అయినను న్యాయవేత్తల సలహానడిగెను. ఆసంఖ్యాకప్రజానీకము ప్రకాశంపంతులు పక్షమునగలదని తెలిసికొనెను. దేశభక్తునివంటి వయోవృద్ధుడును, సీతారామశాస్త్రిగారివంటి నిష్కామయోగియు, అనంతశయనంగారివంటి కేంద్రశాసన సభ్యుడును పంతులునభిమానించుచు తెలిపినవిషయములు గ్రహించెను. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీచేసిన తీర్మానములు

చూచెను. ఆ కాంగ్రెసు కమిటీ అధ్యక్షులు వివరించిన విషయము లాలకించెను. ఇవి అవి అననేల ఎన్నియో ప్రజాహిత సంస్థలు, ఎందరో సుప్రసిద్ధవ్యక్తులు, ప్రకాశముపంతులుగార్ని సమర్థించుచు పంపిన విజ్ఞాపనల చేకొనెను. ఏమైననేమి? ప్రకాశము మంత్రివర్గమును తొలిగించెను.

ఈపట్టున విజయావకాశము లెన్నియున్నను తనప్రధాని పదవిని యెంతఠీవితో జేసెనో, అంత తృణీకారభావముతో విసర్జించుట ఆంధ్రకేసరికే చెల్లింది.

ఇంత రచ్చజేసిన హైకమాండు జేసిన ఘనకార్యమేదియో తెలియరాదు. ద్విభాషి సహాయములేక గవర్నరుతో భాషించలేని వానిని, అసెంబ్లీలోనైన సభ్యుల ప్రశ్నలకు సమాధానము చెప్పలేని వానిని ప్రధానమంత్రిని జేసిరి. 215 మంది శాసనసభసభ్యులుగల మద్రాసు శాసనసభలో మంత్రిపదవిచేయ గల అర్హులు లేనట్లు అసెంబ్లీసభ్యులు కాని వారికి మంత్రిపదవులిచ్చిరి. కాంగ్రెసు ప్రణాళిక నామోదించని పెద్దలను సభానాయకుని జేసిరి.

ఈ సందర్భమున మన ఆంధ్రశాసనసభ్యులు అవలంభించిన వైఖరి యెంతయు లజ్జాకరము. నాన్న పల్లకీ నెక్కెనన్న సంబరమేగాని తమకు సవతి తల్లివచ్చెనన్న విషయము గ్రహింపజాలని వానిచందమున మన తెలుగువారు ప్రవర్తించిరి. అతి ప్రయత్నముమీద ఆంధ్రనాయకునకు లభించిన ప్రధానిపదవిని స్వార్థలాభమునకు బలిపెట్టి మాతృభూమికి చేయరాని అపచార మొనరించిరి. మరల మంత్రిపదవుల నందుకొనవచ్చునన్న పేరాసచే నిజపదవులకు రాజీనామయిచ్చిన తమిళులతోబాటు ఒక ఆంధ్రుడునుఉండుట సంతాపకరము. ఈ సందర్భమున నెంతధీరతతో మంత్రిత్వము నెఱపెనో అంత ధీరతతో మంత్రిపదవిని విసర్జించిన మన సోదరీరత్నము రుక్మిణమ్మగారెంతయు వంద్యురాలు. ఆంధ్రనెలతల గౌరవప్రతిష్ఠల నిలబెట్టినందుల కామెకు మనజోహారు లందించవలసియున్నది. అశాశ్వతములగు పదవుల కాసించి శాశ్వతమగు కీర్తిప్రతిష్ఠల పోనాడుకొనుట ధర్మమనిపించుకొనదుగదా! రుక్మిణమ్మగారు మంత్రిణిగానున్నప్పటి కంటె యిప్పుడే ఆమెగౌరవ మినుమడించినదని నాయూహ. ఈమెయేగాదు వోటమిని ఆనందముతో స్వీకరించిన డెబ్బదిముగ్గురును వంద్యులే. ఈసందర్భమున ప్రకాశము మంత్రివర్గమునకు వ్యతిరేకముగా సంతకములు పెట్టినవారిలో తెనుగుయువతులును కొందరు గలరట. వారేయుద్దేశముతో నిందు భాగస్వాములైరో మనకేమెఱుక? లాభములేనిసెట్టి వరదనుపడడని సామెతగాదా!

కల్పలతా! ఏమైననేమి కాంగ్రెసు హైకమాండువారును మానవమాత్రులే. వారికిని వ్యక్తిగతాభిమానములున్నవి. కక్షసాధింపులున్నవి. ఎదిరిని హతమార్చు స్వభావములున్నవి. చెప్పుడు మాటలువిను అవలక్షణము లున్నవి. హైకమాండును ధిక్కరించుటలో క్విట్ యిండియా తీర్మానమును నిరసించుటలో పాకిస్థానము నామోదించుటలో రాజగోపాలచార్యులుగారిని మించిన వ్యక్తిలేదుగదా! అయిననేమి వారి కాయన అభిమాన పాత్రుడు. కాంగ్రెసు ప్రణాళిక నామోదించుటలో నాచరణయందు పెట్టటలో ప్రకాశము పంతులుగారిని మించిన వ్యక్తిలేదుగదా! అయినను ఆయన వారికి అయిష్టుడు. మొన్న మనవారు మనవారిని తూర్పారబట్టుకొందురు. గొప్పవారైనకొలది మనవారికీ దుర్గుణము. కావుననే చేజిక్కిన ప్రధానిపదవిని తమిళుల చేతిలోబెట్టి వారిదాస్యమునకు దోసిలొగ్గిరి. ఆంధ్రుల చిత్తవృత్తు

ఈ రీతినుండ ఆంధ్రరాష్ట్ర మెట్లుసిద్ధించును? దేశసౌభాగ్యమెట్లు ఉద్దీపించును? చేదుగింజలునాటి తీయనిపంట నభిలషించిన నేమిలాభము? కృషికి తగిన ఫలమనుభవించక తప్పదుగదా!

నేడు మనవోట్ల నభ్యర్థించుచున్నవారెల్లరు కాంగ్రెసు వారనియు, వీరెల్లరు సమైక్యతతో రాష్ట్ర పరిపాలన సాగించి క్షేమలాభముల చేకూర్చెద రనియు, ప్రజానీకమున కిందువలన అనంత సుఖములు చేకూరగలవనియు అకుంఠిత విశ్వాసముతో వోటరులు కాంగ్రెసువారి వోట్లనిచ్చిరి. కాంగ్రెసు అసెంబ్లీ సభ్యులలో వర్గవిభేదము లున్నవనియు, కాంగ్రెసు ప్రణాళికను విశ్వసింపని వారున్నారనియు తెలిసికొన జాలకపోతిమి. వెల్లువ వచ్చినప్పుడు మిట్టపల్లములు కన్పడనిరీతిగా ఆకాంగ్రెసు ప్రచారపు వెల్లువలో వ్యక్తి లక్షణములు కానరావయ్యె. ఏరు తీయగానే నిమ్నోన్నతము బయటపడునట్లు అసెంబ్లీసభ్యుల విజయముచేకూరి మంత్రివర్గమేర్పడగనే వ్యక్తుల లక్షణములు విశదమయ్యెను. అయినను ఓటరు లేమి చేయుదురు. మొదట కాంగ్రెసుచేతను పిమ్మట శాసనసభ్యులచేతను, ఆపై హైకమాండు వారిచేతను పూర్తిగా వంచింపబడిరి. ఇప్పుడు పెదవి కఱచుకొన్న నేమిప్రయోజనము? చేయికాలినవెనుక నాకులను వెదకిన లాభమేమి? ఈ అనుభవమునుబట్టి చూడ వోటరులు తమవోట్ల నొసంగునప్పుడు కాంగ్రెసువారు నిలచిరను నభిమానముతో గాక అభ్యర్థుల మంచిచెడ్డలను స్వయముగా పరిశీలించి వోట్ల నీయవలసిన తరుణ మాసన్నమైనదని చెప్పవచ్చును. రాగలఎన్నిక లిట్టి దృష్టితోనే జరుగగలవనియు నాశింపవచ్చును.

'శారద'




# సౌందర్యపోషణ — చీరసింగారింపు.

శ్రీమతి ఎమ్. సుశీలగారు

సౌందర్యపోషణకి కట్టూ-బొట్టూ, ముఖ్యమన్న సంగతి అందరికీ తెలిసిందే. ముఖం ఎంతఅందంగాఉన్నా, నుదుటిమీద కోహినూరులా మెరిసిపోయే బొట్టులేక పోతే ఎలాగైతే ముఖం వెలవెల బారుతుందో, అలాగే చీరసింగారింపు తెలియకపోతే ఆ అడ్డదిడ్డంగా కట్టుకొన్నచీర అంతఅందానికీ బందమై ఊరుకుంటుంది. అందుకోసమే వస్త్రధారణంలో ఎంతో నేర్పుకావాలి. శీతోష్ణ పరిస్థితుల కనుగుణ్యంగా వస్త్రధారణం వుంటుంది. అందుచేతనే మనదేశపు వివిధప్రాంతాలస్త్రీలు వివిధవిధాలుగా వస్త్రధారణ చేస్తారు. ఐతే ఈచీర సింగారింపు ఇటు కన్యాకుమారినుంచి, అటు హిమాలయాలవరకూ ఒక్కలాగే వుంటుందా అన్నప్రశ్న నాకుతట్టకమానదు. మనదేశం ఒక్కటేఐనా వేష భాషల్లోమాత్రం ఎంతో తేడా కనిపిస్తుంది. కారణం! ఆయాప్రాంతాల ఆచారాలు శీతోష్ణ పరిస్థితులూనూ.

వస్త్రధారణం సౌందర్యపోషణకు దోహదము చేయడమన్నమాట. ఇతరదేశపుస్త్రీల కట్టుచూస్తే మనకికొంత హాస్యాస్పదంగా కన్పించవచ్చుగాని, ఆస్త్రీలు వస్త్రధారణద్వారా ఆవిధంగా సౌందర్యపోషణ చేసుకుంటారు.

మనమంతా 14 మూర లగాయితు 5 మూరవరకూగల చీరలను ధరిస్తాము. నవనాగరికత హెచ్చుతూన్నకొద్దీ చీర సింగారింపులో కొత్తకొత్త పోకడలు పొడసూపుతూన్న సంగతి మనమందరంగ్రహిస్తూనేవున్నాము. చీరపొడవు తగ్గుతూన్నంత మాత్రాన్న చీరసింగారింపుల్లో వికారం వస్తుందనుకోనేరు. నిజానికి ఒకకొత్తఅందమే మనకి ఈ తక్కువమూరగల చీర తెచ్చిపెడుతూంది. ఈనాడు యువతులందరూ ఐదుగజాల చీరలే కడుతున్నారుగాని

వయస్సు మళ్లుతూన్న కొద్దీ కొంత పెద్దరికంకోసం హెచ్చుమూరలుగల చీరలనే కడుతున్నారు.

నిజానికి చీరసింగారింపుకి, చీరపొడవుకిసంబంధించిన హెచ్చుతగ్గులతోనిమిత్తంలేనేలేదు. చీరకట్టుకోడంలోనేవుంది. వంగదేశపు స్త్రీలవస్త్రధారణగాని, ఉత్కలస్త్రీల వస్త్రధారణగాని చూడండి. కట్టుకొనేచీర పెద్దదేకాని కట్టువిధానంమాత్రం ఏమంత బాగుండదు. ముప్పాతిక చీర పమిటగానే వదిలేసి తక్కినది లుంగీలా నడుముకి చుట్టుకుంటారు. ఇంక పమిట కొంగేటి చాంతాడంత వుంటుంది. దానిని మహాపండితులు పట్టుశాలువలు వేసుకున్నట్టు వేసుకుంటారు. ఆచీర సింగారింపుచూస్తే అనాగరీకులైన కోయపడుచులు జ్ఞాపకానికొస్తారు. చీర సింగారింపు చూచినంతమాత్రంచేత వంగనారి అనాగరీకురాలని అనలేము మనం. కారణం వారి దేశాచారము అటువంటి చీరసింగారింపే వారికి అలవరించింది. ఇంక పంజాబీస్త్రీలను తీసుకొండి. వారసలు చీరనే ధరించరు. వారుధరించేది పైజామా. కాళ్లదాకాదిగే పెద్దఅంగరకా. పైన అందమైన సన్నని వోణీ. నిజానికి ఆదుస్తులు చాలాఅందంగా కనుపిస్తాయి. వారికి చీరధరించడంచేతకాదూ; పైగా ఆచారంకాదూ.

చీర సింగారింపులో అందంగా కనుపించేవారు మహారాష్ట్రస్త్రీలు. ఏ మహారాష్ట్ర స్త్రీని చూచినా మనకి వీరవనిత ఝాన్సీలక్ష్మీభాయీ జ్ఞాపకానికొస్తుంది. వారు 18 లేక 19 మూర చీరతప్ప తక్కువమూరగల చీర ధరించరు. వారికట్టుకి అంతకి తక్కువమూర చీర పనికిరాదూ, చాలదుకూడాను. మన తెలుగునాడులో తెలుగు మగవారు కట్టే పైకిలు కట్టు మోస్తరుగా వుంటుంది. వారిచీరకట్టు వెనక్కి రెండు బిళ్లగోచీలుపెట్టి విరిచికడతారు. మహారాష్ట్రస్త్రీల చీరకట్టు నడవడానికి, చలాకీగా పనిచేయడానికి ఎంతోసుళువుగావుంటుంది. పైగా ఆచీర సింగారింపులో వీరత్వం కనిపిస్తుంది. కొంతమార్పుతో ఆమోస్తరుగానే కర్నాటక స్త్రీలుకూడా చీర ధరిస్తారు.

ఇంక దక్షిణాత్యుల చీరసింగారింపు గురించి తెలుసుకుందాము. అరవవారిలో రెండు విధాలైన చీరసింగారింపు వుంది. అయ్యంగారు స్త్రీల సింగారింపు చాలా తమాషాగా వుంటుంది. కొంచెంచీరతో గూడకట్టులాకట్టి తత్తిమ్మా చీరనంతా లుంగీలా ఒకమూలకి వదిలేస్తారు. ఎంతమంచి చీరనైనాసరే ఆ మోస్తరుగానే కడతారు. వారి చీరసింగారింపు

చూస్తే చీరకట్టుకోడం రాదేమో ననిపిస్తుంది. చాలాచిన్నప్పుడు మనతల్లులు విడిచిన చీర మనం సరదాకి కట్టబెట్టుకుంటామే - అడ్డదిడ్డంగా - ఆమోస్తరుగా వుంటుంది అయ్యంగారు స్త్రీల చీరసింగారింపు. ఇంక అయ్యరుస్త్రీలు ఒకమోస్తరుగా ధరిస్తారు. వారిదికూడా ఏమంత అందంగా కనిపించదు. నిజంగా మన తమిళసోదరీమణుల చీరసింగారింపు వారిఅందానికి బందంలాగ తోస్తుంది.

మళయాళదేశపు స్త్రీల దుస్తుల సింగారింపు మరీ వింతగావుంటుంది. ఒక కండువా గూడ కట్టుకడతారు. దానినే 'ముండు' అంటారు. దానిపైన మరోకండువా వోణీక్రింద వేసుకుంటారు. అంటే మళయాళస్త్రీలు ఒకే ఒక వస్త్రాన్ని చీరగా ధరించరన్నమాట. వారి దేశాచారానికి ఆవిధమైన సింగారింపే అనువైనదట. కాని ఆబట్ట కట్టులో ఎంత మాత్రమూ అందం కనిపించదు. వింతగా వుంటుంది.

ఇంక మన తెలుగువారి చీర సింగారింపు గురించి చెప్పాల్సివుంది. ఎంత చిన్న చీరనైనా అందంగా పొదుపుగా కట్టుకోగలము. మననిగురించి మనం చెప్పుకోడం కొంతడాంబికంగాఉండవచ్చునుగాని, నిజానికి మనంతపొదుపుగా నాజూకుగా చీరసింగారింపు మరే ఇతర దేశపుస్త్రీ చేసుకోలేదు. ఎవరైనాసరే మనకట్టును అనుకరించేందుకుకూడా చాలా సులభం. వివిధ ప్రాంతాల స్త్రీల చీరసింగారింపుతో పోల్చిచూస్తే మనసింగారింపు సౌందర్యపోషణకి దోహదంగానూ, అందంగానూ, నాజూకుగాను వుంటుంది.

ఎవరి చీరసింగారింపు ఏవిధంగావున్నా చీరకట్టులో చాలాఅందం వుందనీ, స్త్రీఅయినతర్వాత చీరనేధరించాలనీ, పాశ్చాత్యస్త్రీలు మన వస్త్రాలంకరణను ఎంతో పొగడడమే కాకుండా చాలామంది మనలాగే చీర ధరిస్తున్నారుకూడా. ఇందుకు మనమంతా గర్వపడవలసిందే.

(ఎ. ఐ. ఆర్. అనుమతిని.)



# — గృహపరిశ్రమలు. —

శ్రీమతి తాళ్లూరి సుదర్శనీదేవిగారు.

తనయింటివద్ద పాలపశువులను జాగ్రత్తగా మేపించి, పాలు, వెన్న, నేయి మొదలగువానిని తయారు చేసి, తాము అనుభవించి యితరులకు న్యాయముగా, కల్తీలేక, పరిశుభ్రమైన వానినియిచ్చి, ధనము సంపాదించుటగూడ గృహపరిశ్రమే.

ధాన్యము దంచుటవలన దేహమునకు బలము, ఆరోగ్యము నిచ్చుటయేగాక, నంజు మొదలగు రోగములు రాకుండాజేయును. దంపుడు బియ్యము యింటిలో దంపుకుని, అందరు తినునట్లు జేయుటగూడ గృహపరిశ్రమే.

ఇంటిలో నున్నవారందరు కట్టుకొనుటకు కావలయు బట్టలను తయారుచేయుటకు, యింటి ఆవరణలో వీలున్నంతవరకు ప్రత్తిచెట్లను పెంచి, ప్రత్తితీసి, ఏకులు ఏకి, తయారుచేసి, రాట్నముమీద ప్రతిదినము వీలున్నప్పుడు నూలు వడకుట గృహ పరిశ్రమే.

అంతేగాక, బట్టలు నేయించినతర్వాత పిల్లలకి, పెద్దలకు కావలసిన చొక్కాలు, రవికలు, పరికిణీలు మొదలగునవి స్వయముగా కుట్టుకొనుట, లేసులు కుట్టుట, గృహ పరిశ్రమే.

ఇవి యన్నియు స్త్రీలకు ప్రతిదినము అవసరము. ఇట్టి అవసరమగు గృహపరిశ్రమలను, సులభముగా చేయుటకు వీలున్నప్పుడు, ధనము సంపాదించుటకుకూడా వీలున్నప్పుడు, ఎందుకు మనము పట్టుదలతో చేయరాదు?

మహిమ అంతా ఆడుదానిచేతులో వుంది. స్త్రీలు యీ గృహపరిశ్రమలు తమ తమ యిండ్లలో చేయుట ప్రారంభించిన, మగవారు మనలనుజూచి సిగ్గుపడి తాముగూడ యీ గృహపరిశ్రమలకు ప్రోత్సాహమివ్వరా?

వ్యవసాయమునకు కావలసిన త్రాళ్లు, మోకులు, బుట్టలు, చాపలు మొదలగునవి కొనకుండా, తీరుబడి సమయములలో తయారుచేసుకొనుటకు ప్రయత్నించుట మంచిది. వానితోపాటు తేనెటీగలను పెంచుట, తేనె యంత్రముతో తీయుట; నేర్చుకొనిన నాపరిశ్రమ వృద్ధిలోనికి వచ్చును. సులభముగా దొరకు జొన్నలు, రాగులు మొదలగువానితో మాల్టు తయారుచేయవచ్చు, బిస్కత్తులు యింటిలో చేయవచ్చు.

దేహ శుభ్రతకు అవసరమగు సబ్బులు తయారుచేసుకొనవచ్చు, మంచి మంచి కూరగాయలు, పుష్ప జాతులు, ఆకుకూరలు, పెంచుట, యింటి యుపయోగమునకు నవారు నేయుట, టేపు తయారుచేయుట; గింజలతో బొత్తాములు తయారు చేయుట, యింకను బ్రషులు, కాగితములు, అట్టలు తయారు చేయుట, మొదలగు గృహ పరిశ్రమలను వృద్ధిలోనికిదెచ్చి ధనముకూడ సంపాదించవచ్చును. పండ్లు నిల్వయుంచుట మురబ్బాలు, తాండ్రలు తయారు చేయుటకు వీలుగలదు. ఈ పరిశ్రమలన్నియు బానిసవృత్తిని పోగొట్టి స్వతంత్రజీవనము గలిగించును.

[కొన్ని సం॥ రల క్రిందట - ప॥ గోదావరిజిల్లా భీమవరంలో వ్యవసాయక పారిశ్రామిక వస్తు ప్రదర్శనం జరిగింది. అందులో "గృహపరిశ్రమలు" అనేదాన్నిగూర్చి వక్తృత్వపు పోటీజరిగినది. దానిలో పాల్గొనిన ఈమె రజితపాత్ర బహుమానం పొందినది ఆమె ఉపన్యాసంలో ముఖ్యభాగాలివి. అప్పటికీమె 8 సం॥ బాలిక. ఈమెతండ్రి శ్రీ తా। లక్ష్మీపతిరావుగా రప్పుడక్కడ వ్యవసాయశాఖ డిమాన్‌స్ట్రేటరు.

గృ॥ సం॥]

—(o)—

# వనితావిద్య వెన్నెలవీధి



శ్రీ పంపన నరసింహారావుగారు



అసలు ఆడపిల్లలు అసాధారణ తెలివి తేటలు కలిగివుంటారు. బాలురతో సరిసమానంగా- విద్య చెప్పించి అభివృద్ధికి తీసుకువచ్చే- తల్లి తండ్రులమాట అలావుంచండి. నాలుగు గోడలమధ్యనే నాట్యమాడుతూ వంటియిల్లు-చీపురుకట్ట మినహా-తదితర విషయాలలో-నీకు తాహతు లేదని కడిగినకంచమునే కడిగిస్తూ, తోలిచిన కలశమునే తోలిపిస్తూ- సభ్యతా ప్రపంచకంతో నీకు సంబంధం లేదని- చీకటికొట్టు మసక గదులలోనే మగ్గి సేవచేస్తూఉండవలసిందని శాసించే యీసనాతన వృద్ధజంబుకాలు, ఈ మహిళోద్యమం రాకముందు ఈ హూణవిద్యాభ్యాస హుకుము జారీచేయని క్రితము- ఏనాడేనా- ఏఘడియలోనేనా తలచేరా?...ఈ భారతావనిలో ఆంగ్ల విద్య నభ్యసించి తమజీవితపు ముసుగులను తొలిగించుకొని నవీన నాగరికతా జ్యోతిలో పుచ్చ పువ్వుల్లాంటి నవ్వులను పారబోసుకుంటూ పచ్చపచ్చగా యింతమంది వనితలు- పచారుచేస్తారని ఎప్పుడేనా తలచేరా? ఆబ్బే! తలచిఉండరు- తలిస్తే తబ్బిబ్బయి తల్లక్రిందులై తహతహలాడి పోయిఉందురు...

అసలు స్త్రీ జీవితమే అమితానందమయం-ఈ నవీన నాగరికతా లోకంలో స్త్రీ పురుషు లిరువురు సమానులు. ఒక్కటే ఆత్మ- శరీరం వేరువేరు భాగాలు గలిగి దేహధర్మాల వ్యత్యాసంవుంది కాని, సంఘానికివిరెండు ముఖ్యావసరాలే. వీటిలో ఎక్కువ- తక్కువఅనే పదాలులేవు. పురుషుడు సంసారం వెలుపలి పనులను నెరవేర్చుకివస్తాడు. స్త్రీ అలాకాకుండా సంసారంచుట్టూ తిరుగుతూ- అతిసమర్థతతో నిర్వహింపవలసిన ప్రత్యేకవిధులు చాలావున్నాయి. వాస్తవానికి పురుషులు చేసేపనులు కష్టంగా కనుపించవచ్చు అసలు విషయమాలోచిస్తే సంఘానికి సంసారానికి స్త్రీగృహనిర్వహణమే జీవకర్ర.

గృహ నిర్వహణం మనం చెప్పుకో దగినంత సులభమైనది కాదు. 'బాలుడుపొందే-బి-ఏ-పట్టాకంటే బాలిక పొందే తల్లిపట్టా ఎంతమాత్రం తక్కువది కాదు' అని రాజాజీ చెప్పినట్లు మాతృత్వంలో అంత గొప్పశాస్త్రం నిగూఢంగావుందని మనం నిస్సందేహంగా ఒప్పుకతీరాలి. అందువలననే శాస్త్రీయపద్ధతుల్లో ఆడపిల్లలకి చదువు అన్నిటికంటె ముఖ్యమని చెబుతారు. తల్లులు సరియైన విద్యాసంస్కారం కలవారు కానియెడల పసితనంలోనే పాపల పెంపకంలో అభివృద్ధిలో శిక్షణలో కొంత కుంటితనం కనుపిస్తూవుంటుంది. తరువాత ఆపాపకి ఉన్నతవిద్య ఎంతచెప్పించి నప్పటికీ ఆలోటు లోటుగానే మనకు అవ్యక్తంగా అర్థమాతూవుంటుంది. చిరుప్రాయంలో శిశుపోషణలో ఇచ్చే శిక్షణయే సరియైన శిక్షణ- శిక్షణకు సరియైన సమయమది.

మాతృత్వంలేని స్త్రీజీవితం సాఫల్యత చెందనేరదు. ఆమాతృత్వంలో ఆమె నేర్చుకోవలసినవి చాలా వున్నాయి. అదియొక కళ. విద్యావతియైన తల్లి ఆ కళాప్రవీణతను సమగ్రంగా నిర్వహించ గలుగుతుంది.

పట్టి భావప్రపంచకంలో విహరించటం కేవలం సిద్ధాంతాలలో కాలం వెళ్ళబుచ్చటం ఆమెస్వభావంకాదు. పుట్టిపెరిగి పెండ్లాడి సంసారంచేసి చివరకి వార్ధక్యంలో రాలిపోయే పర్యంతరం ఆమె సదా సక్రియస్వభావం కలిగి వాటిలో ఆరితేరిన ప్రావీణ్యత సంపాయించి అంత్య సమయంలో ఆమెజీవితానికి ధన్యవాదాలర్పించు కుంటూంది. అందువలననే మానవజీవితంలో సంఘంలో చివరకు దేశంలో నవ్యనాగరికతా జ్యోత్స్న ప్రసరింపజేయగలవ్యక్తి ఒక్క-స్త్రీమాత్రమే!

మానవసంఘానికి స్త్రీపురుషులు సమమైన శక్తివంతమైయుండు ప్రత్యేకఅంగములు. ఏఅంగము కుంటుబడినా- ఆలోటు ఎంచకుండానే ఎదుటివారికి కనుపిస్తూవుంటుంది. విద్యావంతమైన దాంపత్య జీవితంవలన వెన్నెలకుప్ప వారిలో కదలి గంతులువేసిన కామం ప్రేమపాన్పులు పరచుకొని పున్నమ వెన్నెల్లో పాదాలు చాచుకొని పవ్వళిస్తూవుంటుంది. వారి కోమలహృదయాల్లో మానవజాతిలోని రాక్షసత్వాన్ని చీకటిని సాధ్యమైనంతవరకు విదళించి చిన్నచిన్నదీపాల తోరణాలు వెలిగించాలనే ఆంక్ష వారిలో సహజంగా పుడుతుంది. వారి ముఖసౌందర్యం తుమ్మల్లో ప్రొద్దుకుంకినట్లుండదు. ఉత్సాహంతో ఉప్పొంగుతూ అలరారుతూవుంటుంది. ప్రకృతికన్న కమ్మనిసంగీతమాలాపిస్తూ వీరిరువురిమధ్య వొయ్యారంగా విహరిస్తూ దోబూచులాడుతూవుంటుంది. మధురమంజీర రవళులు మన్మథుని శింజినీధ్వనులు వారి జీవితాలలో ఎల్లప్పుడూ మారుమోగుతూవుంటాయి.

యుద్ధకారణంగా అనేకదేశాలలో లక్షలకొలది లలితాంగులు పరిశ్రమకేంద్రాల్లో ప్రవేశించి అతినేర్పరితనంతో నిపుణత్వంతో పనులు నిర్వహిస్తున్నారు. పూర్వం అమెరికాలోని స్త్రీలు యుద్ధంలో పనిచేయటం అసమ్మతంగా పరిగణించేవారు. నేడో...? ప్రతి కర్మాగారంలోను కలకలలాడుతూ నవ్వుమొహాలతో నిండు యౌవ్వన బలాన్ని నిగర్వంగా చవిచూపిస్తూ ఎంతో ఉత్సాహంతో మేధాశక్తితో మెషనరీలు నడుపుతున్నారు. అబలలకు సాధ్యంగానిపనులు లేవని గుర్తించారు. ఇప్పుడు ప్రతి ముగ్గురులోను ఒక పడతి పనిచేస్తున్నట్లు అమెరికా లేఖలనుబట్టి తెలుస్తూంది; ఒక్క కాలిఫోర్నియాలో ఈ స్త్రీవుద్యమం ఎంతో ముందుకువచ్చింది. కొంచె మించు మించు అబలలే అన్నిపనులు అతినేర్పరితనంతో నిర్వహిస్తున్నట్లు నిర్ధారణకు వస్తూంది. ప్రియుని బహులతాజాలములో ప్రొద్దులు పుచ్చే చీనావనిత లీనాడుచైతన్యంతో ముందుకు వచ్చి యంత్రాలను ఆలింగనం చేసుకుంటున్నారు. వారిదివరకు అత్తలచేతి క్రిందపడి చెప్పులక్రింద తేళ్ళలాగ అణిగి మగ్గుతుండేవారు. సమానమైన పనికి సమాన ప్రతిఫలం అనే సూత్రాన్ని ఆయాదేశాలు అమలు జరుపుతున్నాయి. రష్యా బ్రిటన్ దేశాలలోగూడా అధినివేశస్థానాల్ని ఆవేశంతో అందుకో జూస్తున్నారు. అసలు 'స్త్రీలు ఎక్కడ వుంటే అక్కడే ఒక సంసారం' అను నొక సామెతవుంది. నిజంగా ఆ ఫ్యాక్టరీ ప్రాంతాలే వసంతారామంగా కనుపిస్తూవుంటాయి ప్రపంచంలో. మానవులలోవుండే అవ్యక్త అత్యద్భుతశక్తులు పరివర్తనం కావాలి. వానిద్వారా సాంఘిక చైతన్యం సమానమైన పంథాలో నడవటానికి అవకాశంవుంది.

ఇంతకీవిషయం విద్య ముఖ్యం. బాలురతో సరిసమానంగా బాలికలనుగూడా విద్యలో విహరించే విధానం మనం ఎక్కువగా కృషిచేయాలి. స్త్రీపురుష తారతమ్యం తర తమభేదాలుఅన్నీ మృగ్యమైనట్లు

భావించాలి. స్త్రీలుగూడా శక్తిమంతులే, మేధావంతులే అని నిరూపించాలి. వారి మేలి ముసుగును తొలగించి లేబ్రాయపు కమ్మతెమ్మెరలు ప్రసరించినట్లు మనంపట్టుదలతో చూడాలి. అజ్ఞానాంధకార గుహలోపడి పొగ సార్చుకపోయిన వారి ముఖమండలాలలో పండువెన్నెల జ్యోతులు ద్యోతకమవటానికి అవకాశాలున్నాయని మనం అవగాహన చేసుకోవాలి.

“మహిళామణులారా! పురుషులతో సమాన ప్రాతినిధ్యానికి మీరు పాటుపడండి. మీజీవితం కళంకంతో ఎదుట వారివెక్కిరింతకు తావీయక నిర్మల హృదయాలతో మీ జీవితయాత్ర సాగించండి. అబలలు అనేపదం మీరు సార్థకంచేసుకోక సంపూర్ణ స్వాతంత్ర్య సామర్థ్యంతో ముందుకువచ్చి మీ జీవితపు డిక్షనరీలనుండి ఆపదంతీసి గిరాటువేయండి. మీ సుకుమార సౌందర్య మేధాశక్తులతో మగవారిని ధిక్కొని, మీమహత్తర శక్తుల నుగ్గడింప జేసికొని మహోజ్జ్వలస్థానాన్ని ఆక్రమించేందుకు అమితంగా కృషి చేయండి. తద్వారా భావిభారత సౌధానికి వెన్నెల మెట్లు నిర్మించిన వారౌతారు. శరత్కాలపు నిండు శశిలా మీ విద్యాకౌశలంలో పరిపూర్ణ సిద్ధిని ప్రజ్వలింప జేసుకొని వెన్నెలవీథులను వెదజల్లి మానవ సంఘంలో మీ నిర్మలకాంతిని ప్రసరింపచేయండి—శలవు.

—— :o: ——

# చిత్ర ప్రశ్నలు

శ్రీమతి చాకలకొండ కనకవల్లిగారు

క॥ నక్షత్రము పేరిట సతి
నక్షత్రము చేతబూని, నాథుని గవయన్
నక్షత్రానికి రమ్మని
నక్షత్రముబట్టిలాగె, నక్షత్రేశున్.

శ్లో॥ చంద్రబింబసమం వస్తు-వస్తూనాం త్రయక్షరం
అకారాది డకారాంతం - కింవస్తు రమణనిర్మితం.



# "మడిదున్నక బ్రతుకవచ్చు * * * * * * మహిలో మాతా"

వైశాఖమాసము. మండువేసంగి. సూర్యభగవానుడు నిండుదీప్తితో నలుగడల తన దివ్య ప్రభాకిరణములను ప్రసరింపజేసి, అనుచర గ్రహసంఘముకూడ తమతమ నియమాలను సక్రమముగ నిర్వర్తించు చున్నారనికూడ గుర్తించుచున్నాడు. అరుణోదయ మేలికాంతులు వేసవి గ్రీష్మముచేకరిగి సువర్ణఛాయను వహించి పర్రుసపగిలిన నల్లని బీటిచేల పల్లముల యందు లోనికి యింకుచుండెనా లేక దాగుకొనుచుండెనా యను భ్రాంతి పొడముచుండెను. ఋషభములు విశ్రాంతిగైకొని పని పాటలులేక రానున్న వ్యవసాయ కాలముకొరకు ఎదురు చూచుచుండును. కోకిలారావములు దిక్కులు ప్రతిధ్వనులు యిచ్చునట్లు వసంతతిలకుని ఆహ్వానించుచుండెను. నదీనదములు క్రొత్తనీటిని చవిచూచి సాగరయాత్రాభిలాషిణులై జన్మస్థానము, మధ్యమజిలీలు, వాగులు, వంతెనలుదాటి మంతనములతో, వెల్లువలతో సాగరుని చేరుటెప్పుడాయని ఉవ్విళ్ళూరుచుండె. ముత్తైదువలు మృగశిర ప్రవేశ మెప్పుడా?- ముంగిలిల్లు చల్లపడుటెప్పుడా, కాల విపరీత పరిస్థితులవల్ల కలిగిన ఈ క్షామదేవతా భీకర రూపమును - రూపుమాప తగిన చట్టములు నీటిమీద వ్రాతలైనవే - కాగితపు సంపుటములలో నుండునా ఆహారసమస్య - పొట్లములు గట్టిచూపిన ఆకలితీరునా - ఉదయము మొదలు సాయంసంధ్యవరకు - ఉషాదేవిని ఛాయాదేవిని, సంధ్యాదేవిని నమస్కరించుకుంటూ, పాడిఆవులకు కసవొసంగుచూ, పంటలకాశించిన పిట్టల, పసువుల- **Quit the yard**- అని మరలింపుచూ, తోలుచూ, సొక్కుచూ యిల్లుచేరి, గంజిమెతుకులు తిని బిడ్డలయేడ్పులను ఓదార్చి గృహయజమానుల చెంతచేరి మనకర్తవ్యము, కృషి, చర్య మరల మొదలిడుదమా, మొరలిడుదమా - యని యాలోచించుచుండ, - స్వప్నావస్థలో కూడా రైతు 1948 సంవత్సరము ఏమగును? - కర్తవ్యమెవరిది? భారతదేశముదా, భారతీయులదాయని పలువరించు భర్తనుచూచి - "కృషితోనాస్తి దుర్భిక్షము" అను ఆర్యోక్తిని సంస్కరించుకొని నడుముకట్టి భారతమాతను మొక్కి యిడుమలులేని "మడిదున్నక బ్రతుకవచ్చు మహిలోమాతా", యంటూ అరుణోదయకుముందు అరకలుకట్టి, మెరకలు దున్నుకొనిన నూకలకు కరువుండదుగదా, తల్లి! నదురు బెదురులేక కదురుతో వడికిన ముడిబట్టలను గట్టినయింతముప్పు వాటిల్లి యుండదుగదా అమ్మా! యికనైన అమ్మా బిడ్డ, అత్తా కోడలు, మామ అల్లుళ్ళూ, అన్నదమ్ములు కల్సిమెల్సి ఏకరుచేయుపనికి మరొకరుతోడ్పడి మెలకువలతో మెలగిన అన్యోన్యగృహబాంధవ్యములు యేర్పడి కట్నములు కానుకలు కత్తిరింతలు తప్పునుగదా చెల్లి!- ఇట్టి ప్రత్యక్షబాధలు పడుతూ రోసములేని బానిసలమై, పడియుండుటకంటే అలనాడు శ్రీరామచంద్రుని పాదుకలు భరతుడు శిరమున నిడుకొనినట్లు ఎద్దులతో దుక్కి దున్నుకొనిన, దుఃఖమే లేదన్నమాటను మరచిపోకండి.

కే. వి. రంగా.




లండన్‌లో తూర్పువైపుగ సామాన్యులు నివసించే ప్రాంతం. అక్కడ అద్దెయిండ్లలో ఉండేవారి అవస్థ చెప్పతరంకాదు. మన దేశంలో వలెనే అక్కడా అద్దె ఎక్కువ చేయరాదు; అద్దెవాళ్లను నిష్కారణంగా పొమ్మనరాదు-అనిచట్టాలున్నూ పుట్టినవి. ఇప్పుడు ఇండ్ల యజమానులు-హెచ్చు అద్దెలాగను కొన్ని పద్ధతు లారంభించినారు. కత్తులు కటార్లు పిస్తోళ్లు తుపాకులు తీసుకొని-అద్దెవాళ్లను బెదరించడం; దానికి ఝడిసి-అద్దెవాళ్లు, హెచ్చు అద్దెలివ్వను సమ్మతించడము; అద్దెహెచ్చుఅని గవర్నమెంటుకు పెట్టుకున్న పిటీషనులను ఉపసంహరించుకోవడం. ఏదీచేయకపోతే 'పోతారా, పోరా' అని అదిలించి బెదరించి తరిమివేయడం-అప్పటికీ లేవని మొండిఘటాలను పట్టుక చావబాదడం జరుగు తున్నదట.

♦ ♦ ♦

ఇటీవల కలిగిన గూడమంచు వల్ల ఇంగ్లాండున 40 లక్షల గొర్రెలు పిల్లలు చచ్చినవి. దీనితో వారి ఆహార సమస్య విషమించినది.

♦ ♦ ♦

జర్మనీ నాక్రమించియున్న అమెరికన్ సైనికులు-జర్మన్ కన్యలను వివాహమాడరాదని మొదట్లో నిషేధమేర్పడినది. గతడిశంబరులో ఆనిషేధం తొలిగినది. నాటినుండి నేటికి 292 మంది ఆఫీసర్లు సైనికులు జర్మన్‌కన్యల పెండ్లాడను అనుమతి కోరినారట. అనుమతి ఇచ్చేముందు ఎప్పుడు జర్మనీ విడిచి తమదేశానికి వెళ్లేది తెలియచేయ వలయునట. పెండ్లి అయిన 30 రోజులలోపల అట్లా వెళ్లిపోవాలట. ఇప్పటికికొద్ది మందికే అనుమతి ఇవ్వబడినది.

♦ ♦ ♦

ఈ మధ్య బికినీదీవిపై పరిశోధనార్థము మిత్రమండలివారు ఆటంబాంబు వేసి చూచారు. అచ్చట జంతువులలో ఏమి పరిణామం కలిగిందో పరీక్షింప నేర్పడ్డ శాస్త్రజ్ఞుడు కెప్టన్. ఆర్. హెరాల్డ్ డ్రేగర్ న్ ఆటంబాంబుతో మనుష్యులు పరస్పరం ధ్వంసం చేస్తుంటే తుదకీ ప్రపంచంమీద మిగులబోయేవి పురుగులు, ఎలుకలు అంటాడు. మనిషి చావడానికి కావలసినదానికన్నా 40 రెట్లు శక్తి వినియోగించినను కొన్ని పురుగులు చావవట.

♦ ♦ ♦

రూర్కీ ఇంజనీయరింగు కాలేజి తూర్పుదేశాలలోకెల్ల ప్రాచీనమైనది. దానిలో ఇన్నాళ్లు స్త్రీలను చేర్చుకొనేవారు కారు. ఈ సం|| ము దానికి శతవార్షికోత్సవం జరుగుతున్నది. ఈశుభ సమయాన స్త్రీ విద్యార్థినులను చేర్చుకోరాదనే నిషేధం తొలగించబడినది అని లోకోన్నివార్త.

# వైజ్ఞానిక విశేషాలు

ప్రపంచంలో మానవుల తెలివితేటలు మందగిస్తున్నవి—అని కొందరుశాస్త్రజ్ఞుల సునిశ్చితాభిప్రాయం. ఇట్లామందగించడం ఇంకాకొంతకాలం సాగితే ఇక 50 సం|| లలో ఇప్పుడున్నవారికంటే రెండురెట్లు హెచ్చుగా మందబుద్ధులేర్పడుతారు. విద్యావంతులుకాగల నేర్పరులుబాలబాలికలు ఇప్పుడున్నవారిలోసగమే అవుతారు—అన్నాడొక శాస్త్రజ్ఞుడు. మరొకశాస్త్రజ్ఞుడు—"ఒకతరం గడిచేసరికి(30సం||లు) 100కి 30మంది మందబుద్ధులు హెచ్చారు. ఈ గుర్రపుపరుగున బుద్ధిమాంద్య మేర్పడేయెడల మానవుల వివేకము త్వరలోనే అడుగంటుతుంది అంటాడు. వేరొకశాస్త్రజ్ఞుడన్నాడుగదా "ఇంతకూ పెద్దపదవులు పొందినవారంతా శ్రేష్ఠమేధావులుకారు" అని.

♦ ♦ ♦

అమెరికాసంయుక్త రాష్ట్రములకు చెందిన ఉత్తర కెరొలీనాదేశంలో ఒకవింత మొక్కఉన్నదట. దాని ఆకులపైవాలిన ఈగలు ఆఆకులలోనే అంతర్హితమైపోయి హరిస్తవని, అక్కడకాలేజిలో బోటనీ ప్రొఫెసరు డా. బి. డబ్లియు. వెల్స్ అనే ఆయన కనుక్కొన్నారు. ఆకుపై ఈగవాలగానే ఆకులోఉండే రంధ్రాలుతెరుచుకొని ఈగకుదారియిచ్చి, అదిలోపల దూరగానే మూసుకొనిపోతవట. ఇకచచ్చినా తెరుచుకోవు. లోపలి ఈగ లోపలనే హరించి ఆకున కాహారమవుతుందట. ఆమొక్కల నితర ప్రదేశములలో కూడా పెంచడానికి ప్రయత్నించారట గాని సఫలంకాలేదట.

♦ ♦ ♦

అది ఎడారి; అందులో ఏమిపండదు—అంటాము. అయితే ప్యారిసులో గొప్ప శాస్త్రజ్ఞుడు డా. జాకొసయద్ మజ్—ఆఎడారిలోనే పంటలుపండిస్తానంటున్నాడు. ఇదివరలో సూర్యరశ్మితో డాక్టర్లుమానవుల రోగాలు కుదర్చడంకద్దు. పూర్వపు నవనగర్ సంస్థానాధీశులైన జామ్‌సాహెబ్ గారు సూర్యరశ్మివల్ల ఫ్రెంచి ఆరోగ్యాశ్రమంలో తనకీళ్లవాతపు నొప్పులు కుదుర్చుకొన్నాడు. ఆయనస్వస్థలానికి వచ్చినతర్వాత అలాంటి ఆరోగ్యాశ్రమమేర్పరిస్తే చాలామందిరోగులు బాగవుతున్నారు. ఇప్పుడీ డాక్టర్ సూర్యరశ్మితో ఎడారిలోమాత్రం ఎందుకు పండించకూడదంటాడు. సూర్యరశ్మితో సముద్రంనీటిలోనుంచి మంచినీరుతీసి ఆఎడారిలోపారించి పండిస్తానంటాడు. అందుకుగాను పరిశోధనలనొనర్చను జామ్‌నగర్‌కే వస్తున్నాడు.

♦ ♦ ♦

గడచిన యుద్ధంలో జపాను, ఓడించినది ఆటంబాంబుకదా. ఈరోజున ఏపత్రికచూచినా "ఆటంశక్తి" నిగూర్చినవార్తలును చర్చలు; అసలీ "ఆటం"(పరమాణువు)సిద్ధాంతం మొదటకనుక్కొన్నపాశ్చాత్యశాస్త్రజ్ఞుడు జాన్‌డాల్టన్. ఆయన 1803 లో ఈప్రపంచంలో పదార్థమంతా పరమాణువుల చేరికఅన్నాడు. దానికితగినంత సాక్ష్యంచూపలేనందున చాలామందినమ్మలే. తర్వాత 1897 లో జర్మన్ శాస్త్రజ్ఞుడొకడు X రే(కిరణం)పదార్థంలోనుంచి దూసి పోగలదన్నాడు. తర్వాత 12 సం|| లకు రూధర్‌ఫోర్డ్ ప్రభువు మన కిప్పుడెరుకపడిన పరమాణువు బొమ్మగీచిచూపినాడు. తర్వాత 1919 లో కాబోలు పరమాణువులను ఛేదించి వస్తుతత్వమును మార్చవచ్చుఅని కనుక్కొన్నారు. తుదకు 1932 లో పరమాణువును ప్రత్యక్షంగా చీల్చి బద్దలుకొట్ట కలిగినారు. అదేతుదకు "ఆటంబాబు" సృష్టికి మూలమైంది.

# ఆటబొమ్మ.



★

శ్రీమతి చుండూరి రమాదేవిగారు.

పూర్వజన్మ సుకృతం వల్ల సంతానం కలుగుతుందంటారు గాని నా పాలిటికి దుష్కృతమే అయింది. సిరిగల వారికి సంతాన సౌఖ్యం ఆనందం. నావంటి దీనురాలికి, పూటకు గతిలేనిదానికి సంతానమెందుకు! ఆ మాయదారి దేముడికి మతిపోయిందేమో కాని, పిల్లలు కావాలని పరితపించే శ్రీమంతులకి, ఎన్ని వ్రతాలు చేసినా, ఎన్ని దానధర్మాలు చేసినా, ఎన్ని తీర్థయాత్రలు చేసినా, తపస్సులు ధారపోసినా ఇవ్వనివాడు; మాబోటి వాళ్లకు అయాచితంగా యిస్తాడు. నాకు ముగ్గురు మొగపిల్లలు ఒక్క ఆడపిల్ల మేము యానాదులం. నేను ఆ పక్క వీధిలో వుండే జమీందారు గారింట్లో పాచిపని చేస్తున్నా. నా పెనిమిటి కూలో నాలో చేసి రోజుకి పావలా డబ్బులు తెస్తుండేవాడు. ఉబ్బు ఖాయిలాతో ఆర్నెల్లు తీసుకుని ఏడాదిక్రిందట కాలం చేశాడు. ఆయనజబ్బు మొదలెట్టినప్పటినుంచి నానాతిప్పలు పడుతున్నా నమ్మగారూ. ఆదొరగారిచ్చే మూడురూపాయిలు ఎల్లాసరిపోతాయి! ఇప్పటికి పన్నెండు రూపాయలప్పైందమ్మా. ఇల్లాంటి స్థితిలో నాబిడ్డలకి ముద్దులు, ముచ్చట్లూ ఎల్లాతీరతాయి. మొన్న మా అమ్మగారు బజారెడుతూ నన్నుకూడా వెంట పెట్టుకెళ్లారు. మాసూరి నాలుగేళ్లది వెంటబడ్డది. చంకపెట్టుకొని వెళ్లాను. అమ్మగారు సామాను కొనటమైన తరువాత మా అమ్మాయిగారికి ఆయిదు రూపాలుపెట్టి చక్కని ఆటబొమ్మను కొన్నారు. మాసూరి చిన్నపిల్ల అవటంచేత ఆబొమ్మను చూసి మురిసి పోయి 'అమ్మా నాకు కూడా బొమ్మే' అనియేడుపు సాగించింది. ఆబొమ్మను ముట్టుకోటానికి కూడా మాకు తాహతులేదు. గదిమి చంకనేసుకున్నాను. మా అమ్మగారు 'ఈదరిద్రపు ముండను ఎందుకు తీసుకొచ్చావే' అనివిసుక్కున్నారు. నాకు చచ్చినచావైంది. ఇంటికొచ్చినకాడ నుంచీ మాసూరి ఒకటేగోల. "అమ్మా, బొమ్మ, అమ్మా, బొమ్మ," యిదేజపం. రాత్రికి జ్వరం తగిలింది. మొన్నటినుంచి మూసిన కన్ను తెరవదు. అమ్మాయిగారు, బొమ్మ, అవేకలవరింతలు. నిన్న ఏమైనాసరే మా అమ్మగార్ని ఒక్కసారి బొమ్మ అడుగుదామని వెళ్లాను. కాని అడగటానికి గుండెలేదు. పిల్లబాధచూడలేను. చివరికి ధైర్యంచేసి "అమ్మా పిల్లకి మూడురోజుల నుంచిజ్వరం, బొమ్మకోసం పలవరిస్తోంది. ఒక్కసారి బొమ్మయిస్తే మళ్లీజాగర్తగా వప్పజెపుతానమ్మా" అన్నాను. నామాటలు వింటూనే ఉగ్రరూపం ధరించిందాతల్లి. "దరిద్రపుముండా! నీబతుక్కి బొమ్మేతక్కువైంది. మూణ్ణాళ్లనుంచి పని ఎగ్గొట్టిందేగాకుండా మాటలుచెపుతున్నావ్, నీపనిమాకవసరంలేదు. యికమా గుమ్మంతొక్కద్దు" అని ఏమేమో తిట్టిపోశారు. నీపని మాకవసరం లేదనే ముక్క చెవినిబడే సరికి నీరైపోయాను. ఇంకా ఆయమ్మ ఏమేమన్నదో వినిపించలేదు. ఇంటికెళ్లేటప్పటికి పిల్లస్థితి బాగుండలేదు. ఇది నాస్థితి. అమ్మగారు జాలిగుండె కలవారు. మంచివారు. పేదసాదలను దయతో చూస్తారు. ఆయనది అమృతహస్తమనివిని ఆశతో వచ్చా. అమ్మా నన్ను కరుణించి అయ్యగార్ని పిల్లనుచూసి రెండు పొట్లాలిమ్మని చెప్పండమ్మా. మీకాళ్లకి మొక్కుతా

నమ్మా, అంటూ చేతులు జోడించింది ఆ అమ్మి. నాహృదయం ద్రవించి పోయింది. వెంటనే మావారిని లేపి విషయంచెప్పాను. వారుకూడా దయార్ద్ర హృదయులు కాబట్టి బద్ధకించకుండా ఆయెండలోనే బయలు దేరారు. నౌఖరు చేతికి బేగ్ రూ 5 లు ఇచ్చి ఈపిల్లకు ఒకబొమ్మ కొనియిచ్చి రమ్మని చెప్పిపంపాను. పదినిమిషాకల్లా వెళ్లినవారు వెళ్లినట్లే తిరిగి వచ్చారు. బొమ్మ బొమ్మ అంటూ ప్రాణాలు విడిచిందట ఆపిల్ల.

భగవానుడు సర్వాంతర్యామి, ఆశ్రితమందారుడు. ఆయనకు, సర్వజీవుల యందు సమత్వమే నంటారు! అపక్షపాతమెందుకో! ఒకరికి హంసతూలికా తల్పాలు, ఒకరికి ఊకటిక నేల. ఒకరికి రమ్యహర్మ్యాలు, ఒక రికి చుట్టుగుడిశలు, కొందరికి షడ్రసోపేత భోజనము, కొందరికి గంజినీళ్లకే కరువు. ఇన్ని సౌఖ్యాలు కల్పించి వారికి పాషాణా సదృశహృదయాలను కూడా కల్పించాడు. ఒక్కసారి బొమ్మయిస్తే ఆఅమ్మ సొమ్మేం పోయింది? మనమింతే పెట్టిపుట్టామని తృప్తికల్పించుకోటానికి తగిన వయసుకాదా పిల్లది. కోరిక ప్రతిజీవిక సహజమే, ఆ అమాయక పసినిసుగుకు తీరనికోరికై పోయింది ఆబొమ్మ.

—(౦)—

## శ్రీ కాశీశ్వరరావుగారి బిల్లు

శ్రీ కాశీశ్వరావుపంతులుగారి కొత్తబిల్లు, బహుభార్యా భర్తృత్వముల నిషేధించి, వివాహముల రద్దునకనుమతిచ్చుచుండుట వలన చాలా ఉపయోగముగ నున్నది. అంతమాత్రము చేత ప్రతిస్త్రీ, పురుషుడు "విడాకులు" కోరుదురనుకొనుట హాస్యాస్పదము ఏదైనా చట్టరూపమున నున్నప్పుడే దానివిలువ తెలిసి యుండును. ప్రస్తుత కాలానుసారముగ సదరుబిల్లు ప్రజలకెంతయేని యుపయోగపడగలదు. ఈబిల్లువలన చీటికి, మాటికి, కొట్టి, తిట్టుభర్తల నడవడిక కొంతతగ్గుతుందని కూడా నమ్మకమున్నది. గాన, శ్రీ కాశీశ్వరావుపంతులుగారి బిల్లు తప్పక శాసన సభలో ప్యాసు కావలెనని, నా అభిప్రాయమును వెల్లడించు చున్నాను.

అయ్యదేవర కాలా ప్రెపుగ సుందరమ్మ.

## విజ్ఞప్తి

'గృహలక్ష్మి' యందలి రచయితల చిత్రపటములు ప్రచురింపుడని పలువురు కోరుచున్నారు. ఆకోరిక మాకిదివరకేగల అభిలాషను ఇనుమడింప చేసినది. కాన క్లుప్తమగు తమ చరిత్రలతోపాటు చిత్రపటములనుగూడ రచయితలు మాకంపగోరెదము.

సంపాదకుడు.



పంజాబులో జరుగుతున్న మతకలహాలను గూర్చి మాట్లాడుతూ పటేలుగారిట్లా అన్నారు:—

పంజాబులోని హిందువులు శిఖులు తమ స్త్రీలను పిల్లలను క్షేమకర ప్రదేశాలకు పంపాలని ఆందోళన పడుచున్నారు. కాని ఇక్కడే ఉండి ధైర్యంగా నిలబడడం మంచిదని నాసలహా. నేనుచెప్పేసలహా ఒక్కటే; మీరు బెదరిపోకుండా అక్కడే ఉండి వారిదురాగతాలను ప్రతిఘటించాలి.

"మద్రాసు రాష్ట్రీయ క్షేమనిధి" అనుసంస్థ మద్రాసు గవర్నరు సతీమణిగారి ప్రోత్సాహమున ఏర్పడినది. దాని నీలగిరిమండల శాఖ యాజమాన్యమున శ్రీగవర్నరు సతిగారిట్లు ఉపన్యసించినారు:—

మేము మద్రాసు వచ్చిన వెంటనే గత సంవత్సరము నా భర్తవెంట వెళ్లి కొన్నిగ్రామములను చూచితిని. అచ్చట గ్రామస్థులు పడేబాధలు, వారిదుస్థితి చెప్పతరముకాదు. ఉదాహరణానికి కొన్ని చెప్తాను. ఒకపట్నంలో ఒక ఆసుపత్రి ఉన్నది. ఆ ఆసుపత్రి మధ్యనుంచీ మూతలేని ఒకజలదారి ఉన్నది. అందుచే ఆ ఆసుపత్రి చుట్టుప్రక్కలంతా కశ్మలమే. ఆ ఆసుపత్రి ఒకపాకవలె ఉన్నది. ఆసుపత్రులకు, ఔషధాలయాలకు, గ్రామాలకు ఎక్కడా సంబంధం లేదు. అందుచేత వాటిసహాయం వారికేమాత్రం లేదు. ఆకారణంగా వారుచావు అంటే, ఏదోవికల్పమాత్రము అని భావిస్తారు. ఇవన్నీచూచి ఈప్రజల కష్టాలను తీర్చడానికి ఏమిచేయగలమా! అనియోచించాను. ఏప్రభుత్వమున్నా ఎంత ఇష్టమున్నా ఇంతపని ఒక్కసారి సాగించలేదు; కాన ఆమాటవిరమించుకున్నా. అప్పుడీ నిధి సంగతితోచింది. ఈరాష్ట్రంలో ఈపనికని లక్షలివ్వగల వారున్నారని నాకుతెలుసు; వారితోపాటు శ్రీరాముల వారికి లంకాపట్నానికి వారధి కట్టను తోడ్పడ్డ ఉడతాభక్తితో తమశక్తికొలదీ ఇవ్వగలవారూ ఉన్నారు. ఈనిధిశాశ్వతంగా గ్రామీణుల కష్టాల తొలగించే కార్యక్రమం సాగించాలెనంటే-ప్రజలు పూర్తిగా దీనినాదరించవలెను. రామాయణ మహాభారతముల వంటి గొప్ప పురాణగ్రంథాలను ప్రపంచానికి ప్రసాదించిన దేశంలో ఇట్టి ఉత్తమకార్యాలకు దానంచేయడంలో ఏమాత్రమూ లోటుండదు. రాణీమంగమ్మగారిని కన్న ఈదేశంలో ఈనిధికి చాలా మంచి భవిష్యత్తున్నది. ఈవిషయంలో కర్ణుని దేశమైన ఈభూమిలో ఇతర రాష్ట్రములకు ఉదకమండలములు ముందడుగువేయాలి.

ఢిల్లీలో బాగ్గుగనుల స్త్రీ కార్మికుల యోగక్షేమములకై కృషిచేయు "కామినీ కళ్యాణసేవికా శిక్షణా శిబిరం" ప్రారంభిస్తూ-ఆచార్యకృప్లానీగారిట్లా అన్నారు:-

ప్రతిసేవావిధానానికి ఒకసాంఘికాదర్శం ఉన్నది. ఈ ఆదర్శాన్ని సడలకుండా ఎదుటనుంచుకొని, దీక్షతోపని చేయాలి. లేకపోతే, అసలు ఉద్దేశమే భంగంపొందవచ్చును. ముఖ్యంగా ఒకప్రభుత్వశాఖచే ప్రారంభింపబడ్డ సాంఘిక సేవాసమితిలో పనిచేసేవారు ఈసంగతి బాగాజ్ఞాపకం పెట్టుకోవాలి.




## లేడీ హార్ప్ స్త్రీలకళాశాల.

జన్మకెల్లా శివరాత్రి అన్నట్లుగా ఆంధ్రదేశంలో ఒకనొక స్త్రీలకళాశాల వెలిసింది; అదీ, గుంటూరు పురంలో. దాని పుటకకైన రాద్ధాంత సిద్ధాంతా లిక్కడ ప్రస్తావించనక్కరలేదు. ఎట్లాగైతేనేమి ఆది ఏర్పడ్డదని సంతోషించాము. నిజంగా అంత ప్రయత్నంచేసి దానిని సాధించిన మునిసిపాలిటీవారు దానికి తగిన శ్రద్ధాభక్తులతో నిర్వహించవలసిది - అయితే సాధించడానికి అవసరమైన ఆవేశపుపొంగు అయిపోయినమీదట మునిసిపాలిటీ దీని నిర్వహణభారం మోయ లేమనుకున్నది కాబోలు. ప్రభుత్వాన్ని స్వీకరించమని కోరినారట. ప్రభుత్వంవారి ఖర్చులు పలుముఖాలు. వారు తటపటాయిస్తుంటే - మిషనరీలు మేము నిర్వహిస్తామివ్వండి - అన్నారని వింటున్నాము. ఇంతకన్నా అవమానం ఉండబోదు. మిషనరీలు నిర్వహించలేరనికాదు. వారి ఉత్సాహాన్ని ప్రశంసిస్తాముకూడా. మ్యునిసిపాలిటీ, రాష్ట్రప్రభుత్వం నిర్వహింప వెనుకాడుతుంటే, వారుభయులకు ముఖ్యమైనప్రజలేమైనారని - పరాయిదేశంనుంచీ, వచ్చిన మిషనరీలు- అక్కడినుంచీవచ్చే విరాళాలతో నిర్వహించవలెను? ఆంధ్రరాష్ట్రమహిళాసంఘంఅని- ఆ. భా. మహిళాసంఘంశాఖ వకటి ఉండాలిగదా; వారేల దీనిని నిర్వహింపరాదు? అంతేగాని మిషనరీలకు విడువడం అవమానకరం.

## బస్సులు, ట్రాములు - స్త్రీలు.

బస్సులలోను, ట్రాములలోను స్త్రీలు స్థలంచాలక పడేబాధ చెప్పతరంకాదు. ఎవరైన పురుషులు దయతలచి లేస్తేనే - వారికి కూచోడానికి స్థలం దొరికేది. పురుషులున్నూ, అందులో అశక్తులు, అహంకారులు, మేముమాత్రం డబ్బిచ్చి ఎక్కినాముకదా - అని బిరబిగుసుకొని కూచుంటారు. కలకత్తాలో వీటిలో సగం సీట్లు స్త్రీలకు ప్రత్యేకిస్తారట. స్త్రీలులేనప్పుడే పురుషులు దానిమీద కూర్చుంటారు. వారు రాగానే లేస్తారుట, ఆ ఏర్పాటు మద్రాసులోకూడా ఎందుకు చేయకూడదు?

---

## గమనించండి.

మేము ప్రచురింప జాలని రచనలు రచయితలకు తిరిగి పంపబడవు. కాబట్టి వృథాగా పోస్టుబిళ్లలు పంపకండి. నకళ్లు వ్రాసి ఉంచుకుని అసలు రచనలంపితే ఉభయత్రా సౌకర్యం.

సంపాదకుడు.

---








## ప్రపంచ చరిత్ర.

జవహారిలాల్ నెహ్రూ తనకుమార్తె శ్రీమతి ఇందిరాగాంధీ చిన్నబిడ్డగా ఉన్నప్పుడు ఆమె చదివి విజ్ఞానవంతురాలు కాగలందులకై ప్రపంచములో జీవరాసులు, మొలకలనుండి, క్రిమికీటకములై, పక్షులు మృగములై, వానరులై నరులై, వివిధజాతులై, విజ్ఞానవంతులు, నాగరికులునైనచరిత్రనంతయు కొన్ని ఉత్తరములలో వ్రాసియుండెను. వీనిలో చాల ఉత్తరములు జైలునుండి వ్రాసినవే. వానిని సంగ్రహించి ఈపుస్తకరూపాన శ్రీచింతా దీక్షితులుగారు అనువదించారు. సంస్కృతి ప్రచురణవారు ప్రచురించారు. వెల 2-0-0 లు మాత్రం. వలయువారు కల్చరల్ బుక్స్ లిమిటెడ్, పెరంబూరు అనివ్రాయుడు.

## విజయలక్ష్మి పండిట్.

జవహారిలాల్ చెల్లెలు, భారతస్వాతంత్ర్య సమరంలో పేరుమోసిన వ్యక్తి. యు. పి. రాష్ట్రమంత్రిణి అయిన శ్రీమతి విజయలక్ష్మిపండిట్ గారి జీవితచరిత్రను శ్రీ పురాణం కుమారరాఘవశాస్త్రి బి.ఏ. గారు రచించారు. ది మోడరన్ న్యూస్ ఏజన్సీ బుక్ సెల్లర్స్ అండ్ పబ్లిషర్స్ (గవర్నరుపేట బెజవాడ) వారు ప్రచురించారు. భాషచాలా సులభంగా ఉంది. వెల రూ 1-0-0 మాత్రమే. పబ్లిషర్స్‌కు వ్రాస్తే రాగలదు

## నా జీవితం.

గాంధీమహాత్ముడు ఆత్మకథనంతా గుజరాతీభాషలో గొప్పగ్రంథంగా వ్రాసినాడు. దానిని కీ. శే. మహాదేవదేశాయిగారు ఆంగ్లంలోకి అనువదించారు. పాఠశాలలో విద్యార్థుల ఉపయోగార్థం దానినే దేశాయిగారు క్లుప్తపరచినారు. ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయం ప్రెస్ వారు ప్రచురించారు. వారివద్ద అనుమతి పొంది శ్రీపోలవరం శ్రీరాములుగారు అనువదింపగా సంస్కృతి ప్రచురణవారు ప్రచురించారు. దీనిలో అపూర్వమైన గాంధీగారి చిన్ననాటి బొమ్మలుకొన్ని ఉన్నవి. వెల రు 1-0-0 మాత్రమే. సంస్కృతి ప్రచురణవారికి పెరంబూరు, మద్రాసు అనివ్రాస్తే రాగలదు.

## సామ్రాజ్యము.

లూయీఫిషర్ అసలు గ్రంథకర్త; పండితారాధ్యుల నాగేశ్వరరావుగారు అనువాదకులు. "అమెరికా కొరకు, ఇంగ్లండ్ కొరకు రష్యాకొరకు, చిన్నరాజ్యాలకొరకు, వలస ప్రజలకొరకు, శాంతికొరకు

సామ్రాజ్యాలు పోవాలి" అని ఈపుస్తకంలో తుదివాక్యం. దీనినిబట్టే ఈగ్రంధం యొక్క ధోరణి తెలుస్తుంది. వెల రూపాయి. దీనిని ప్రచురించినవారున్నూ సంస్కృతి ప్రచురణ వారే; వారికి వ్రాయండి.

**క్రాం తి గీ తా లు.**

"క్రాంతి"అనగా హిందీలో విప్లవం; విప్లవమును రేకెత్తించేగీతాలు అని దీనిఅర్థం. అయితే ఆదేమి కర్మమో కాని 1921 నుండి ఆంధ్రదేశంలో బయలుదేరిన పాటలలోగాని పద్యాలలోగాని-ఏకొద్దియోతప్ప—జీవంలేదు; రసంలేదు; తెలుగుభాషకు వైశిష్ట్యమైన సంగీతములేదు. తమిళంలో భారతీగీతాలతో పోల్చదగినవి చాలా చాలాకష్టంగా ఉన్నవిఅనవచ్చు. ఈ గీతాలురచించినది శ్రీ కాశీవిశ్వనాథంగారు. వెల 0-4-0 లాల్ పబ్లికేషన్స్, గవర్నర్ పేట, బెజవాడ అనివ్రాయండి.

**మ హి ళా ప్ర బో ధ ం.**

ఇవిన్నీపాటలే; ఇందున్నూ స్త్రీలకు విప్లవమార్గం బోధించబడ్డది. దీనిని రచించినవారున్నూ శ్రీ కాశీవిశ్వనాథంగారే. వెల 0-5-0 మాత్రమే. లాల్ బుక్ డిపో, గవర్నర్ పేట, బెజవాడ అని వ్రాయవచ్చు.

**ఆ రా మ ము.**

ఖండకావ్యములసంపుటం: కర్త: శ్రీబలుసుపల్లి రామజోగారావుగారు. మామూలు భావకవుల ఊహాప్రపంచనిర్మిత సుఖదుఃఖాలు, తెలియనిఆవేదనలు — చాలవరకు కావ్యవస్తువులు. అంకితం శ్రీవేదుల సత్యనారాయణగారికి. ఈ కావ్యాన్నిగూర్చి భావకవి చక్రవర్తిఅయిన—శ్రీ తల్లావఝుల శివశంకరశాస్త్రి గారి అభిప్రాయం: "ఆరామంలో మంచిరీతి, మాధుర్యంతోకూడినభావ స్ఫురిస్తున్నవి" అని. వెల ఇందు లేదు, వీరికి వాదాడ గ్రామం, శ్రీకాకుళం తాలూకా అనివ్రాయండి.

**అ మ ర జ్యో తి.**

కర్నూలునుండి వెలువడే 'తెలుగుసచిత్ర వారపత్రిక'. సంపాదకులు శ్రీ గంధే రఘురామగుప్తగారు. ముఖ్యంగా రాజకీయాలే యిందులో ప్రస్తావింపబడుతున్నాయి. రాయలసీమలో పత్రికలు చాలాతక్కువ. ఆలోటు నిదికొంత తీర్చగలదు. విడిపత్రిక వెల 0-1-6 సం|| చందా - రు 5-0-0 లు.

**ఉ ద య భా ను.**

మైలాపూరులో తెలుగుబాలురు, బాలుర సంపాదకత్వమున ప్రచురిస్తున్న ఉదయభానుఅనే త్రైమాసిక పత్రికను ఇదివరలో పాఠకులకు పరిచయంచేసియున్నాము. వీరి రెండవ సంచికకూడా వెలువడినది. పట్టుదలతో బాలురైనా పత్రిక సాగిస్తున్నందుకు సంతోషిస్తున్నాము. వీరిందులో ఈపత్రిక ప్రచురిస్తున్న ఉదయభాను బాలసంఘం - 1946 సం|| రం ఆదాయవ్యయములు ప్రచురించారు. ఇది ఆంధ్రులకు శుభలక్షణము. అది బాల్యావస్థలోనే వారి కలవడడం హర్షింపదగినది. విడిపత్రిక రు 0-4-0.

Printed and Published by Dr. S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd, 15, Westcott Road, Royapettah, Madras. Editor : Dr. K. N. Kesari.

# విషయసూచిక